# బల్లకట్టు పాపయ్య

[ కథలు ]



రచన:

మాగోఖలే




విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

# శివరేత్రి తిరణాళకు

"యాదప అంబోతు మొగం యీాడూ, మీానబడి కొట్టాడు—యీాం,—యీాం— నేనే పెగ్గోట్టాయితే తెల్చేది, యీాడి యవారమేందో. అసలా బోడికొమ్ముల్దుండదే — చింబోతు మొగందీ—దా న్నెప్పుడో నాగాకోడూ రెక్కేదాకా బాత్తా. అదేవోం వొల్లు తెగబల్చి సాయిమేసులు కొణ్ణాంచి యిరగ బీక్కునీ, ఎల్లి అసమంతయ్యతోట పాడుసెయటం బాగుండదీ, నేనేవోం వుత్తి పుస్నానికి, వామికాడ సుట్టు కాలుత్తా కూకు నుంటేనీ, వొచ్చి యీాపుమీాన గబాగబా బాత్తుంటాడు. సెబు తాలే వుండు నీ పనీ. మొన్నోపాలి యింతే. దూడ పాలు గుడ్చుకుసిపోతేనీ, సెంబు దీసుకుని అదేమయిన బాదాడు. ఎప్పుడో ఈఁలు జూసుకుని నలగబొడుత్తాలే వుండు నీపనీ," అని చౌదరయ్యగారింటో జీతంజేత్తుండ కోటాయి చౌదరయ్య యింటికాడ కంపరంబుట్టి, యీాపు రుద్దుకుంటూ, ముక్కు ఎగ బీల్చుకుంటూ, చౌదరయ్యను అదిదిమకుంటా యింటిదార్నబడి వొత్తా వుండాడు.

గెన గెన గెన, గల గల గల మోగినై దొజత్తంబం మీాన గెంటలు.

"ఓరి శివయ్యోవ్, ఓరి సూరామోవ్! కిందటేడు మోకులూ, పగ్గాలూ రాంకెట్టమ్మగారింటో పెత్తే యింకా

యిదిగో కోటాయోవ్, తెల్లారిందమోయ్, యీపడు మనూరి పెద్ద మేగాన్నికి తెగసుద్దంట సూసోకరా!'' అన్నాడు బూసాయి.

"అరే నాయినా నువ్వు లెగవాల—అరహరా!" అనరిశాడు కోటాయి.

"అరహరా!" అనరిశాడు బూసాయి.

"బూసాయ్?"

"ఏందిరా కోటాయ్?"

''ఈ పేసు పెచ్చుంద్రామయ్య గిత్తల్ని కడ్తాడంట్రా పెదకూ?" అనడిగాడు కోటాయి.

"ఒక పెచ్చుంద్రామయ్య గిత్తలేంది! అంకమ్మ కుమ్మరోళ్ళ కోడెగిత్తలూ, అయ్యన్నగారి బసవమ్మ బుడంపాడు గిత్తలూ— మొత్తం యాభై జతలంట్రా యీ పేసూ!" అన్నాడు బూసాయి.

''ఆఁ! మరి జవ్వాది సెంచయ్య వాళ్ళెత్తుండాడంట్రా?" అనడిగాడు కోటాయి.

"పళ్ళూడగొట్టించి, కాళ్ళు కొట్టించి దక్కురబా - వాళ్ళొత్తా డంట్రా!" అన్నాడు బూసాయి.

"అసలు సెంచయ్యా లేంది ఆడేంవుండదిలేరా! నీకాడ గులాం వుండదంట్రా బూసాయ్?"

"అరాచ్చెలెదు వుండదిరా కోటాయ్."

"బూసాయిపనే రొక్కంగా వుండది, కొంచెం కెలా వుండాడు" అని యిశారబడ్డాడు కోటాయి.

"ఎవురు నేనా? సాస్త్రీరా కోటాయ్! మా సిన్నాయిన పేసీపసి పడదోశాడుగదంట్రా! "కోరి తిరనాలకాడ యాడ వోయ్ సాలూ" అన్నాడ్రా-తూత్- తుబుక్కున వుమ్మాశాడు బూసాయి.

"యీడికి అదీ లేదుగదంట్రా!" అన్నాడు కోటాయి.

"అదేందిరా! మనవంతా ఒక మాటాగా ఎల్దాంఅను కుంటుంటే ఏందిరా కోటాయ్? మీ అయ్యనడిగితే పంపియ డంట్రా?"

"నీకు తెలవనులేరా బూసాయ్? అసలు మనకి మీస కట్టాంచింసంటే యీళ్ళసని ఏవున్నా వుంటది లేరా...యిదుగో బూసాయ్, నే యింటికెళ్ళి యిప్పుడే సెలగోత్తాగానీ యీడే వుంటావ్ గదంట్రా–సగోత్తాగా యవారమేందో-" అంటా గోడ దూకి యింటేప్పులకి గబాగబా బయల్దేరాడు కోటాయి.

"అసలు తేల్చేత్తాలే ఎల్లి అయ్యనడిగి. అదేం జబ్బో ఎప్పుడన్నా ఏవన్నా అడుగుదామంటే మీసమీసకొత్తాడేం మనిసీ? ఎటసబ్బా సావొచ్చిపడింది? తను పెండ్లికి పెండ్లు పగాకు తాగిబారెడ్డెచ్చుగాని, కాత్త కోరి తిరనాలకన్నా పంపితే ఏవో? ఎల్లి అడక్కుండా వూరుకుంటాంగా? అమ్మ సెబితే యింటాడంటా? ఏవో. ఆమాత్రానికే యినే మచ్చయితే యిగనేం? మరి తను కిందటేడు చిలుకూడవా పసుపుని కొండకి ఎల్లొచ్చేం? యీపాలి నన్నూ పంపియమంటా సమంటాడో సూద్దాం. పంపియనంటేనా– నేనావ దిన్నే దిసను. ఆమయిన ఏడుత్తా, దేశాలమీనకి లేసిపోతానంటా. అమ్మ ఏడుస్తది. ఆమయిన అయ్యకి గుబుల్దిరిగి "ఎల్లి ఆడే సావు"

అనంటాను, కోరికోరనాల కెల్లమని. ఏడుకోసులుండ కోటయ కొండకు ఎటుగా ఏ పియ్యాల్లే!" అనుకుంటా ఆలోసెనల్లోబడి సూత్తే లెక్కవొచ్చిన కోటాయికి సెవికాడ ఏదో తుర్రు పిట్టకిమల్లే 'తుర్రు' మంది, మడిచ్చిని పుల్కిరి బిక్కిరి జేత్తా.

"ఏందిరా అట్ట పులిక్కిబడ్డావు కోటిగా గుహీహాహీహీ!" అంటా పకపక పగలబడ్డది, కోటాయికోసం దాగ్గొని కనిపెట్టు క్కూర్కునుండ కోటాయి పొరిగింటి సేవితారాలు కొండమ్మ.

"ఎవురూ—కొండమ్మా?—ఎందుకమ్మా నా సెవిలో అట్టరిశావ్?" అన్నాడు కోటాయి సెవిలో వేలుబెట్టి తిప్పుకుంటా.

"యిహీహీహీ—అట్ట సూత్తావేందిరా కొక్కిపిల్లికి మల్లే!" అంది కొండమ్మ సవ్వాగక.

"నువ్వుండలా గంగానమ్మకిమల్లే తేలుకొండీజ జేసుకొని," అన్నాడు కోటాయి.

"కోతి కోతి!" అంది కొండమ్మ, కోటాయి ఎకసెకాల సూత్తా.

"ఆఁ, సూడా—యిదిగో కొండామోవ్, నా చంగ తెగగవు, నేనసలే మంచోణ్ణిగాను, తెలిసిందా?" అన్నాడు కోటాయి.

"మరి సన్నేందు కనాలేం?" అంది కొండమ్మ.

"ఎవురు నేనా ముంగలండీ—అందుకే కొం దేకుదు ద్దనేది" అన్నాడు కోటాయి.

"అహాఁ!" అంది కొండమ్మ మోరకిరుత్తా.

"యిహీఁ!" అన్నాడు కోటాయి.

"నేను—కోటయ్య కొండకూ—" అని ఆపింది కొండమ్మ.

"ఆఁ!" అన్నాడు కోటాయి.

"ఏం వుండదీ!" అంది కొండమ్మ.

"అంతేగందా! ఏందో అన్నావనుకుండాలే" అన్నాడు కోటాయి.

"మా బావొచ్చాడుగా!" అంది కొండమ్మ.

"అఁగొచ్చి ఏవోఁ మా వొస్తే!" అన్నాడు కోటాయి.

"మరే మా అప్ప అందిగందా బావంతో—"

"ఫ్రాంత్!" అన్నాడు కోటాయి.

"యీ ఏడు కోటయ్యకొండ తిరనాలకి ఎల్దాం అంది. చరేనన్నాడు బావ" అంది కొండమ్మ.

"అట్టనా!" అన్నాడు కోటాయి.

"ఎక్కిరిస్తావులే వుండూ. మా అప్ప నన్నుగూడా తీసి కెల్తానంటే, బావ చరేనన్నాడుగా — మా అమ్మగూడా ఎల్లమంద" అనేసింది కొండమ్మ.

కోటాయికి గుండెకాయికాడ ఏదో కలిక్కిన వాటేసు కని గుంజింది.

"అన్నీ వుత్తదేలే!" అన్నాడు కోటాయి.

"పాపం, ఎగతాలనుకుండాడయ్యా! కావాలంటే ఎల్లి మా అప్ప నడుగు తెల్చుద్ది" అంది కొండమ్మ.

"అమ్మంగో డంటే!" అనడిగాడు కోటాయి.

"అమ్మంతోడు" అంది కొండమ్మ.

నేలమీానకి సూశాడు కోటాయి - ఆడ పంబా లేసిన నత్త గవ్వలు నోళ్ళు దెరుసుకునుంటై.

"నువ్వుగూడా రావంట్రా కోటిగా?" అంది కొండమ్మ కోటాయి యవారం జూసి.

"నే రాను-నువ్వే ఎల్లు మీా అప్పోళ్ళకో-" అన్నాడు కోటాయి.

"ఎందుకురా అంత దుడుకూ?" అంది కొండమ్మ.

"బూసాయీాళ్ళందర్తో నే కోటప్పకొండ కెల్తుండాలే! హాఁ! యీాపాలి పంపున్నా వుంటవలే ఆడ!" అన్నాడు కోటాయి.

"కోటి తిరనాలకంట్రా నువ్వు బోయేది? పలుఁ! కోటయ కొండ తిరనాల జూత్తే నీ జనమలో మరిచిపోతా? ఆడికి లచ్చలు, ఏలు పెబ లొత్తయంట్రా! అబ్బ - నా జనమలో జూళ్ళా అన్ని పెబలు! యాడ జూసినా రంకు లాటలేనంటా! చినిమా లొత్తయ్యంటా, కాఫీ ఓటళ్ళు వొత్తయ్యంటా, లైట్లు లుంటయంట్రా - మరి - మరి బొంబాయిమజా వొచ్చుద్ది ట్రా- ఒరేయ్, యీా పడు కాంగి రేసోరి, కమ్యూనిష్టోరి పెబలుగూడా వొత్తయ్యంట్రా - అబ్బ అబ్బా!" అంటా సంబరంలో బట్టది కొండమ్మ.

"నా చంగతి ఎవురికీ అక్కర్లా - నే దేశాంతరా లెల్లగసి పోతాలే—" అన్నాడు కోటాయి గబక్కన.

"అదేందిరా కోటిగా! కోటితిరనాలకి ఎల్లిపోతుండా నంటివిగదంట్రా?" అంది కొండమ్మ.

"ఏమ్మా వూరకనే అంటే? అసలో మా అయ్యోనా నన్ను పంపిచ్చేనీ? పచ్చాకా ఆ సౌదరయ్యగారింటోనే పడి సావమంటాను. నీకు యాదో చుసివుండదిలేదే కొండమ్మా!" అన్నాడు కోటాయి.

"ఓరి యదవా! అప్పద్దాలంట్రా సెప్పేది? పోనీలేరా నీ చంగద్దెల్చెంకీ!"

"మరి నువ్వు సెప్తావుంటే యటనమ్మా? యిగ సెప్పనుగా" అన్నాడు కోటాయి.

"పోనీలేగా! అయితే కోటంపుకొండకి నువ్వుగూడా రావంట్రా?" అంది కొండమ్మ.

"అయ్య సంపడూ?" అన్నాడు కోటాయి.

"అసలు అడిగిసూశావంట్రా?"

"ఊహూం. ఇప్పుడేగామ్మా అసలు నాకు చివరాత్రి చంగద్దెల్చిందీ," అన్నాడు కోటాయి.

"అయితే దొబ్బునెళ్ళి అడిగిరారా ఎటనైనా."

"ఉడగమంటా?" అన్నాడు కోటాయి.

"మరి మనిస్తరం కల్చి ఎళ్లకక్కర్లేదంట్రా?"

"ఎటనే కొండమ్మా?" అన్నాడు కోటాయి జప్పుంకుతా.

"వారి పోరా నీ కసలు బైర్నం లేదూ."

"నీకు దెల్సా?" అన్నాడు కోటాయి.

"ఒరేయ్? ఆ రోజున ఎంకడు నన్ను ఎక్కిరిత్తే ఎళ్ళి ఆణ్ణి సావదన్న లేదంట్రా నువ్వూ?"

"సజ్జలు గార్నయి ఎదవకు!" అన్నాడు కోటాయి.

"మరి యెగనేంరా? నాకు తెల్చులేరా నీకు బల్ దైర్నం వుండదనీ! ఎల్లి గొబ్బున అడిగేసెయరా?" అంది కొండమ్మ కోటాయి సెయి గట్టిగా వొత్తుతా.

"ఇంటికాడే వుంటాడేమో—" అంటున్నాడు కోటాయి.

"అయితే మా అప్పోళ్ళతో నే నొక్కద్దానే కోటయ్య కొండ కెళ్ళిపోతాలే. ఎల్లిపోతుండాలే—" అంది కొండమ్మ కోటాయి సెయి యిసిరిగొట్టి.

"ఇదిగో కొండమ్మోవ్-యింటేను. బెమ్మదేవుండు గాడు, రావనాబ్బెమ్మ అడ్డంవొచ్చినా సరే, యీ నక్కా కోటిగాడు బలాగా కొండమ్మతో, పెదపాలెం పెదపంట కోటయసామిం కొండెక్కాల్సిందే అరహరా—" అనుకుంటా బంయిన యింటి ముంగలకి లగెత్తాడు కోటాయి.

యింటిలోన—కోటాయి నాయిన రంగయ్య అప్పుడే పొలంలో యవారాలన్నీ సూసుకుని వొచ్చి, ఇబవదని, యింటి ముయాన తంబంకాడ కూకుని సుట్టపాయ సుట్టుకుంటా, కాస్తే అవతాడ బువ్వదింపోతుండ పెల్లాం రవనమ్మతో అదిని మాట్టాడ్తుండాడు.

"కోటిగా?" అని పిలిశాడు రంగయ్య కోటాయి సల్లగా లోన అడుగెయ్యటం ఓ కంట కనిబెట్టి.

"ఏందయ్యా?" అనడిగాడు కోటాయి మంత్రకట్టు తగిలోడికిమల్లే ఆడే ఆగిపోతా.

"యేన్నుంచిరా నువొచ్చేది?" అనడిగాడు ~~రంగయ్య~~ అడగాల్సిన పక్కీగా.

"మరేసోఁ – నేనేసోఁ – ఆణ్ణించేసనయ్యా," అన్నాడు కోటాయి గుటకేత్తా.

"చా యదవా నాసిమాలలు రానిత్తావ్ ? సొదరయ్య గారింటో పని జెయ్యనన్నావంట దేనికిరా!" అనడిగాడు రంగయ్య.

"నన్ను సావదన్నాడయ్యా," అన్నాడు కోటాయి.

"ఈసి ముసలారా, సిన్న పిల్లోణ్ణి కొట్టాడేంటి!" అంది రమనమ్మ సప్పున.

"ఏహె వుండాతలా. మాటమద్దెన నువేంటి – అయితే బర్రెగొడ్లు అనమంతయ్యగారి తోట్లోబడి మొక్కలన్నీ పాడు జేత్తుంటే, నువు యాడ్రా వుందీ ?" అన్నాడు రంగయ్య.

"మరేసోఁ–మాటకి ముందే కొట్టాడయ్యా సొదరయ్య గోరూ," అన్నాడు కోటాయి కళ్ళు నలుసుకుంటా.

"అదేం సెయ్యా ఆ సవదరయ్యనీ !" అంటున్నది రమ నమ్మ వూరుకో బుద్దిపుట్టక.

"మద్దెన బాస మాట్టాడొద్దని నీకు సెప్పలేదంటే ? నువుండాడ–అయితే సుట్టాలుత్తా వాపికాడ కూకుండా వంటా, మరి అవకాడ బర్రెగొడ్లు యిడిసెమ్మెసుబోతే, ఆడ నీ పనేందిరా పొళ్ళాడదన్నే గోళ్ళు లేకా ?" అనరిశాడు రంగయ్య.

ఎంటనే కోటాయి ఆవజాన కుప్పున బూమ్మీన కూలి పోయి 'బ్యావ్' మంటా నేల రుద్దిముద్ద ఏడుత్తావుంటం, ఎంటనే రమనమ్మ లగెత్తుకుంటా వొచ్చి 'మాయ్యో, మాసిన్ని నాయినే' అనంటా కోటాయిని కాగలించుకోని బుజ్జగియటం, నిమిస్సమ్మీన చినిమాకీమల్లే జరిగిపోయిందన్నమాట.

ఈ యవ్వారమంతా వయినంగా సూత్తావుండ రంగయ్య కూసేపు నోరుదెరిసి, కాసేపుటికి 'కసా కసా' మంటూ సలిదగ్గు దగ్గి, సుట్ట ముట్టిచ్చుకొని అటనే తంబానికి జారగిలబడి, కళ్లు మూసుకుని మైకంలోపడిపొయ్యాడు ఏదేం సంబంధంచనట్టు.

"మా అయ్యగా బువదించావు దా," అంది రమనమ్మ. సల్లగా కోటాయిని బువమూకుళ్ళకాడికి లాగుతా.

"నాం కొద్దే బువ్వా – నే దినసే – ఊహూం ఊహూం."

"యేన్నాడూ?" అన్నాడు రంగయ కళ్ళు దెరవకండా.

"ఏమో తాలుంగు సవ్వా, ఆగ్నెసలు బెదరగొట్టే — దాయ్యా యీడ కూకో యిద్దరం బువదిందాం," అంది రమనమ్మ కంచంలోకి బువ తోత్తా.

"నాం కొద్దే —" అటన్నాడు కోటాయి, యవ్వారం దారికిరావాలని రమనమ్మ కోసగుంటా.

"అదినొ అంటకే — యింద నోరు బట్టు-మారే, నీకు కోటయకొండ యాడవుండదో తెల్సాంట్రా కోటిగా?" అంది రమనమ్మ కోటాయి నోట్లో పొంగ్పోకూడ ముద్ద పెడ్తా.

"క్యాం?" అన్నాడు ముద్దనోట్లో కోటాయి.

"చివరేత్రికి కోటయసామి తిరినాల బలే సంబరంగా వుంటదంట్రా కోటిగా," అంది రమనమ్మ రంగయ్యకల్లి ఒక్కసారి ఒక సూపు సూత్తా.

"ఏందమ్మా?" అనడిగాడు కోటాయి. రమనమ్మకల్లి, రంగయ్యకల్లీ అనుమానంగా సూత్తా.

"ఈ ఏడు మీ అయ్య నన్ను కోటయకొండ తిరనాలకి తీసుకెళ్తాడంట్రా," అంది రమనమ్మ నవ్వుతా.

"ఖక్-ఖక్"ముద్ద కొరబోతావుండా సగం తెగిశాడు, కోటాయి.

"లేదు లేరా నిన్నుకూడా తీసుకెల్తాడంట లే కూకో-"

"ఏం య్యా!" అనరిశాడు కోటాయి.

"అటనేలే బువదిను," అన్నాడు రంగయ్య, కల్లుదెరిసి పక్కనవు నవుతా.

'అరహాగా' అంటా ఎగిరే ఎగట్టం పక్కింట్లో కొండమ్మ ముంగల కెల్లిపడ్డాడు కోటాయి.

"అమ్మ బుల్లో-ఏందిరా ఏందిరా కోటిగా?" అనంది కొండమ్మ బిత్తరబోయి.

"కోటయకొండ-మా అయ్య-మా అమ్మ-అరహారా-" అంటా గబిక్కిన కొండమ్మ సెయిబట్టుకొని ఎగట్టం మొదలు పెట్టాడు కోటాయి.

కొండమ్మ అప్ప సెంద్రమ్మా, బావ సూరయ్యా దిమ్మర బోయి లోన తడికసందుల్లోంచి ఏం దిదని యింతగా చూశారు.

తెల్లార్తే చివరేత్రనంగా యాభై జతలెద్దుల్తో ముంగల మేలాల్, తాలాల్తో జవ్వాది సెంచయ్య పరవళ్ళు దొక్కుతావుంటే, గులాం గొట్టుకుంటూ పెదపాలెం పెబా, ఎనకమాలే సెయిసెయి గలిపి 'అరహారా' అనకుత్తా ఆనోరి సుట్టాల్తో కోటాయి కొండమ్మలూ, కోటయసామి కొండకి పయానమయ్యారు.



# అభిమానం

బజార్నించి వీధితలుపు గుండా తన్నిన బంతికిమల్లే గెంతుకుంటూ పుస్తకాలసంచీతో వరండాలోకి వచ్చి దూకాడు చంద్రుడు.

రోజూ సాయంత్రం చంద్రుడు బడినుంచి యింటికివచ్చి, పుస్తకాలసంచీ యింట్లోపారేసి, ఆటలకు వెళ్ళేసమయానికి వరండాలో అమ్మ సీతకు జడవేస్తూండేది. తన కింకా బడి యోగ్యత పట్టలేదుగనుక చంద్రుణ్ణి చూడంగానే జడ వేయించుకుంటున్న సీత, చంద్రుడు బడికి వెళ్ళినప్పటినుండి జరిగిన సంఘటనలు జడ కదరనీయకుండా తలా చేతులూ తిప్పుతూ గుక్కతిరక్కుండా ఏకరువుపెడ్తూంటే, అమ్మ ఆ వొక్క నిమిషంలో కొంపలంటుకుని కప్పులు మీదపడ్డంత గొడవచేసే సమయంలో – సీతను బుగ్గలు గిల్లుతూ పరామర్శించి, పుస్తకాల సంచీని వదిలించుకుని చంద్రుడు బయటపడేవాడు యీలలు కొట్టుకుంటూ.

"సీతా!" అంత దూకుడుమీద వచ్చిన చంద్రుడు వూపు ఆపుకుంటూ అట్లాగే నిలబడిపోయాడు వరండా మూల నక్కికుని కూచున్న సీతను చూసి.

"ఎందుకే అట్లా కళ్ళు రుద్దుకుంటున్నావ్–" చప్పున వచ్చి సీతపక్కన కూచున్నాడు చంద్రుడు.

"వ్రాఁ-ఘో-"

"ఎందుకే, ఎందుకే- చెప్పవు కాదూ-ఎందుకే ఏడుస్తున్నావూ ?"

"వ్రాఁ-, వ్రాఁ-," ఎక్కు-సాగింది సీతకు.

"అమగోర అందుకే-మా అమ్మగదూ-ఏమే, వాళ్ల కిష్టాయ్ కొట్టాడా ?"

"అమ్మ—అమ్మకొట్టింది-వ్రాఁ-వ్రాఁ-"

"అమ్మేగదా—యింకా కిష్టాయ్ గాడేమోననుకున్నా."

"ఘో—ఘో — ఎందుగ్గొట్టాలేం వుత్తపున్నానికే—వుహూఁ—వుహూఁ—" తగిన సానుభూతి పొందని సీత ఒక్క సారి బావురుమంటూ కాళ్ళతో చంద్రుణ్ణి తన్నటం మొదలు పెట్టింది.

"ఎందుకే — ఎందుకమ్మా నన్ను తంతావూ-నీకు బిళ్ళలు కొనిపెట్టాగా - అమ్మను కొడ్డాంలే - ఎందుగ్గొట్టిందీ అమ్మ సీతా ?" బుజ్జగిస్తూ సీతను దగ్గిరికి లాక్కున్నాడు చంద్రుడు.

"వుత్తపున్నానికి కొట్టింది పాపం వ్రాఁ-వ్రాఁ-"

మరి నువ్వు అల్లరిచేశావా ?"

"ఎప్పుడూ అల్లరేనమ్మా పాపం-"

"మరేంజేస్తే కొట్టిందే ?"

"మరె నేనేమో—యిందాకేమో— ఆ పోయిదగ్గర అమ్మ వీపుమీద ఆనుకుంటేనూ—చూడమ్మా ఎట్టా కొట్టిందో నెత్తురొచ్చేట్టూ—"వొంగి వీపుమీద గొనులాగి చూపింది.

ఒక్క క్షణం తల దిమ్మెరపోయింది చంద్రుడికి సీత వీపు మీద కమిలిపోయిన అయిదువేళ్ళూ చూసేసరికి. అమ్మ యింత దెబ్బకొడ్తుందని చంద్రుడికి మొదటిసారి తెలిసింది.

"అమ్మో! ఎందుకొట్టిందే యిట్లా!"

"చెప్పలేదయ్యా— వృత్తినే—వూం—వూం—" ఒక్కసారి కొత్తబాధ ముంచుకొచ్చింది సీతకు.

"అమ్మేదే—?"

"దొడ్లో వుంది—పాపం—"

"ఈ అమ్మ యిట్లా కొడ్తుందేం—!" అనుకున్నాడు చంద్రుడు పెద్దగా.

* * * *

రాత్రి పదింటికి యింటికివచ్చి నాన్నే అన్నం పెట్టుకుంటున్నాడు. అమ్మ దొడ్డిగుమ్మంలో కూచుని చీకట్లోకి చూస్తున్నది. రోజూ అమ్మా నాన్నా, యిద్దరూ కలిసి అన్నం తినేవాళ్ళు...

"అమ్మ అన్నం తింటం లేదెందుకో!" అనుకున్నాడు చంద్రుడు.

"నాన్న అమ్మను కొట్టాడ్రా" అన్నది చంద్రుడిపక్కలో సీత. వెంటనే చంద్రుడు తెలుసుకున్నాడు, సీత యివాళ తొందరగా నిద్రపోవటానికి అవకాశం లేదని.

"పెద్దగా అరవబోకే—యింకా నీవు నిద్రపోయినా వనుకున్నా—"

"నిజంగారా, నాన్న అమ్మను కొట్టాడు - నే చూశారా—అబ్బ—అమ్మ ఎట్టా ఏడ్చిందనుకున్నా—" చప్పున సీత నోరు మూశాడు చంద్రుడు వొక్క-క్షణం.

వంటింట్లో అన్నపు గరిటె గిన్నెకుతగిలి ఖంగ్‌మంది. అమ్మ అట్లాగే కూచుంది.

"ఎందుకొట్టాడే?" అన్నాడు చంద్రుడు, యింకొంచెం సీతదగ్గరకు జరిగి, గొంతు వెలుగురాచుకుపోయిన స్థాయిలో సంభాషణ సాగిస్తూ.

"మరే, అమ్మో, చీర తీసుకురమ్మంది నాన్నని."

"ఏం చీరే?"

"కొట్టోంచి కొత్తచీరెరా!"

"ఈ అమ్మకు ఎప్పుడూ చీరెలుండవు!"

"అమ్మకు కాదురా అన్నాయ్, చీరే."

"మరి ఎవరికే?"

"మనత్తయ్య వొస్తుందిట్రా!"

"ఎవరూ—కనకమ్మత్తయ్యా?"

"ఆఁ."

"ఒస్తే—?"

"అమ్మ అత్తయ్యకు చీరె కొంటుందిట!"

"అమ్మో! ఆ అత్తమ్మకు చీరెలు కావాల్సిందే! మరి కారున్నదిగా ఆ అత్తయ్యకూ—"

"మనం ఎక్కొద్దాంట్రా అన్నాయ్ కారూ-మరే-నేనే-చక్రం తిప్పి ప్రుయ్ మనిపిస్తా-" ఒక్క క్షణం సీత నోటిమీద చంద్రుడి అరచెయి ఆగింది.

"దాని కారెక్కావంటే నీ చెవులు పిండుతా సీతాం."

"ఏం(ట్రా అన్నయ్యా—మన త్తయ్యది కాదమ్మా కారూ ?"

"ఉన్నదిలే బొంబోడికారు దనికే! నేను పెద్దవాణ్ణయితే స్టీమరంత కారు కొంటా!"

"స్టీమరంటే ఏం(ట్రా అన్నాయ్?"

"అబ్బో అది కొండంత వుంటుంది!"

"అబ్బ!"

"మహా గొప్ప-టుప్పాయి కారు!"

"అన్నాయ్?"

"ఏంటే?"

"మరి నువ్వు తెల్లవారి పెద్దవాడి వవుతా?"

"ఛా-తెల్లవారంటే రేప్పొద్దున్నే గాదుటే?"

"మరి ఎన్ని తెల్లవార్లకు పెద్దవాడి వవుతా?"

"పోవే నీకేం తెలియుదూ—మరి నాన్నంత పెద్దవాణ్ణయితే, అప్పుడూ."

"నాన్నంత పెద్దవాడి వవుతే—అప్పుడు అమ్మను కొట్ట వు(ట్రా ?"

"ఛీ అట్లా అంటే కళ్ళుపోతయ్యేవ్ సీతాం. మనమ్మ మంచిది! "

"మరి నన్నెందు కొట్టిందమ్మా?"

"మంచమ్మ కొడ్తే ఏమ్మా!" సీతాంవీపు ఎందుకు వాత తేలిందీ తెలుసుకుంటానికి ఆటేసేపు పట్టలేదు చం(దుడికి.

"ఆఁ!"

"మరి కనకమ్మత్తయ్యకు చీరె తెమ్మంటే నాన్న అమ్మను కొట్టాట్టే?"

"అహఁ—అప్పుడే కొట్టలా!"

"మరెప్పుడూ?"

"చాలాసేపయినాక కొట్టాడు."

"ఎందుకనే చాలా సేపయినాక కొట్టిందీ?"

"మరే, నాన్న డబ్బు లేదంటుంటే అమ్మ చీరె తెమ్మంటున్నదీ—మరెట్లా?"

"ఈ అమ్మ ఎప్పుడూ యింతే – అసలే నాన్నదగ్గిర డబ్బు లేదంటుంటే."

"మరే – 'నే దరిద్రుణ్ణే' అని యిట్లా తలకాయ పట్టుకుని అన్నాడ్రా నాన్నా!"

"అస లెందుకో యీ కనకంకు చీరే!"

"మరి నాన్నదగ్గిర చాలా కాన్లున్నయి గదుట్రా?"

"ఎక్కడయినా కానీలకు కొత్త చీరె వొస్తుందిటే సీతాం?"

"రాదుట్రా?"

"అస్సలారాదు."

"మరి నా దగ్గిర రెండు–మూడు కాన్లున్నయ్యే–"

"బిళ్ళలు కొనుక్కుందాంలే."

"అమ్మ నీకుమల్లే పుస్తకాలు కొనుక్కోమందిరా ఇన్ని పనికాన్లయినాకా! మరే, నేనే, పరికిణీ కొనుక్కుంటానంటే సరే దాచుకోమందిరా. అన్ని కాన్లుంటే పరికిణీ వస్తుందిట్రా అన్నాయ్?"

"సరేలే నేను కొట్లో కనుక్కుంటాలే."

"అన్నయ్యా—మన కనకమ్మత్తయ్య గొప్పదిట్రా ?"

"ఎవరన్నారే ?"

"మరే, అమ్మేమన్నదంటే నాన్నతో 'మీ చెల్లెలు వాళ్లు గొప్పవాళ్ళు—సిగ్గేస్తుంది' అన్నదిరా!"

"అస లీకనకమ్మత్తను పంగలకర్రతో కొట్టాలి !"

"కనకమ్మత్తను చూస్తే సిగ్గేస్తుందట్రా అన్నాయ్ ?"

"అమ్మకు సిగ్గేస్తుంది!"

"నీకో ?"

"చచ్చినా వెయదు."

"మరి అమ్మకు ఎందుకేస్తుందిరా సిగ్గూ ?"

"వూరుకో లే నీకు తెలియదుగానీ—"

"ఎందుకు తెలియదమ్మా—"

"సీతాం ?"

"ఏంట్రా అన్నాయ్ ?"

"కనకమ్మత్తయ్య ఎప్పుడొస్తుందే ?"

"వుత్తరం రాసిందట్రా చెన్నపట్టంపోతూ యిక్కడదిగి పోతానని."

"అది మంచిదికాదే."

"ఏదిరా ?"

"కనకమ్మత్త."

"ఎందుకన్నా ?"

"పిశినారి."

"అంటే ఏంట్రా అన్నాయ్ ?"

"నీకు బిళ్లలు కావాలని ఏడుస్తుంటే ఒక్క కానన్నా యియ్యాదు."

"కనకమ్మత్తయ్య దగ్గిర చాలా కాన్లున్నయ్యా!

"అబ్బో వాళ్లింట్లో గోతాల్నిండా వున్నాయి."

"మరి ఒక్క కానన్నా యియ్యాదుట్రా బిళ్లలు కొనుక్కొంటానికి?"

"యియ్యాదు."

"ఆఁ! మరి అమ్మ కనమ్మత్తయ్యకు ఎందుకు చీరె కొనాలమ్మా?"

"కనకమ్మత్తయ్యకు చాలా డబ్బుందిగా! మరి మనమ్మక్కూడా చాలా డబ్బుందని చూపించి గొప్ప చెప్పుకుందామని."

"అట్లా ఎందుకురా అమ్మ అంటుంది అన్నాయ్! మరి నాన్న డబ్బు ల్లేవన్నాడుగా!"

"నా పుస్తకాలకే డబ్బుల్లేవు నాన్న దగ్గర."

"నా పరికిణీకోమ్మా?"

"లేవమ్మా."

"అయితే కనకమ్మత్తయ్య మనింటికొద్దు."

"ఒస్తే రానీ-"

"చీరె కొనిపెట్టొద్దు."

"ఎవడు కొనిపెడ్తాడే-అసలీ కనకమ్మత్తయ్యబోలెడన్ని సార్లు కాఫీలు తాగుతుంది అసలే నాన్నదగ్గిర డబ్బుల్లేకపోతే!"

"అన్నయ్యా, మరే, పొద్దున అమ్మే, నాచేత రంగయ్య కొట్టోనించి అన్నికాన్లు పెట్టి-అంత కాఫీపొడి తెప్పించిందిరా- ఎవర్తో చెప్పద్దంది."

"ఎక్కడివే, అమ్మకు అన్ని కాన్లు సీతా?"

"కిష్టాయిగారమ్మదగ్గిర తెచ్చిందిరా! మళ్ళీ నాన్నదగ్గిర తీసుకు నిస్తాననీ."

"నాన్నకు తెలుస్తే చంపడూ!"

"మళ్ళీ గొడ్తాడా నాన్న అమ్మనూ!"

"ఈ అమ్మకేం తెలియదు-"

"ఎట్లా-!"

"స్-అరవకే నాన్న చెయి కడుక్కుంటున్నాడూ-"

"అమ్మ అన్నం దిన్లేదురా అన్నాయ్."

"తిన్లేదే సీతాం- అరవకు-"

ఒక అర్ధరాత్రి అమ్మ వంటింటోనించి మూతి తుడుచు కుంటూ నాన్నగదిలోకి పోవటంచూసింది సీత.



# మార్పు

ఉన్నట్టుండి నాన్న పెద్దవాడై కూచుంటాడని వుద్యోగంలోబడ్డ సత్యానికి వూహించడానికైనా అవకాశం లేకపోయింది. యిన్నాళ్ళనుంచీ యింటిపెత్తనం చేస్తున్న నాన్నకు అకస్మాత్తుగా రెండు మోకాళ్ళూ పట్టుకుపోయి గడప దిగటం లేదు. తాలూకాఫీసులో గుమాస్తాగిరి చేస్తున్న సత్యంమీాద మరికొన్ని పైళ్ళుపడ్డయి యింటి వుద్యోగంకూడా కలిసి వొచ్చేసరికి.

ఏ నెలా సత్యంసంపాదించే ఆ నాలుగురాళ్ళతో ఎప్పుడూ యిల్లుగడవదుగనుక, అమ్మచేతులు అడ్డాలుపెడ్తున్నా అటుండమంటూ స్వగ్రామంలో - పోయిందిపోగా మిగిలివుంటూ వొచ్చిన - రెండూ ముప్పాతిక ఎకరంలో రెండెకరాలమాగాణీ భూమిని లోగడే యోగ్యత గలవారికి సద్విక్రయం చేశాడు నాన్న.

ఏపని మొదలుబెట్టినా ఆసాంతం చూడందే విడిచేమనిషి కాదు నాన్న. వున్న ముప్పాతిగా వుండి వుద్ధరించే దేవిషీ సిస్తు కూలీలు దండగ కాకపోతే - అని మరీ దరిమిలానుంచి ఆలోచనలు పీడగా నెడ్తూంటంవల్ల - మోకాళ్ళుపడ్డ మర్నాడే మందులన్నా తిని బతుకుతానంటూ, ఆ ముప్పాతిక ఎకరం విక్రయం సత్యంచేతులకు వొప్పగించాడు నాన్న.

దివాళా వ్యవహారంలో మొహం చూపించేందుకు మనస్సు కంగాళీగావున్నా పదేళ్ళకు మళ్ళీ స్వగ్రామాన్ని చూసే అవకాశం దొరికినందుకు సత్యానికి యింకో కవయిపు ఆనందం కలగకపోలేదు.

స్టేషన్నుంచి అన్నిమైళ్ళూ ఆలోచనల్లోబడి నడుస్తూ వొచ్చిన సత్యం స్వగ్రామం పరిసరాల పిల్లకాలవల దగ్గిరకొచ్చి వెనకటి ఆనీటివాసన తగిలేసరికి ఒక్క శ్వాస విడిచి తలెత్తి చూశాడు తన చుట్టుపక్కలా.

ఆ పిల్లకాలవలు మెలికలుమెలికలు తిరుగుతూ దూరపు చేలల్లోకి మాయమవటం, వాటి నీటిపాయదలనైనం, అంచుల్నే నుత్తిగా పేరుకన్న ఒంగ్రడనూ ఒకక్షణం – ఆవిధంగా – చూసి చప్పున రోడ్డుమీద కంకర్రాయి నొకటి దీసి ఒంగ్రడులోకి "తాప్పున" విసిరేసి, అది మాయంకాగానే చేతులు దులుపు కుంటూ గబగబ పది అడుగులు ముందుకువేసి – టక్కీమని బ్రేకువేసినట్టు ఆగిపోయి వెనక్కు తిరిగిచూశాడు సత్యం. మూడడుగులవెనుక ఆమూల తిరుగుడులోనే వుంది ఆ గానుగ చెట్టు. ఆశ్చర్యం, తను దాన్ని గమనించకుండానే ముందుకు పోటం! ఆ గానుగచెట్టుమీద తను కొన్ని జీవితాలకి సరి పొయ్యే కోతి కొమ్మంచులాట లాడాడు.

వెంకయ్య ఏమయినాడో! ఒకరోజు వెంకయ్య కాళ మీద తనను కూతతో తాకి ఔటు చేస్తానని శపథంచేసి "కోతికోజిల్లా" రంటూ కూత పెడ్తూ వొచ్చి చెట్టు గజం ఎక్కేసరికి కట్టుకున్న పంచ వూడి కిందపడ్డది. నిమిషంలో వెయ్యోవంతులో వెంకయ్య నిర్ణయించుకోవాలి. శపథం

ప్రకారం తనను ఔటుచేయటమో, గుక్క అయిపోయ్యేటట్టు పంచ కట్టుకుంటూ పంతం చెల్లించుకోలేకపోవటమో. వెంకయ్య మొండిమొలతో, గుక్క ఆపకుండా చెట్టెక్కటం చూసి తనకు గుండె దిగజారి పట్టుదప్పి కిందపడి పరుగెత్తటానికి ప్రయత్నించేలోపల - గభాల్న ఔటుచేసి పంచగట్టుకున్నాడు. మిగతా ఆటగాళ్ళు నోళ్ళుదెరిచి చూస్తుంటే, పకపకనవ్వు నవ్వుతూ.

ఆ దృశ్యాన్ని చెట్టుమీద పోల్చుకుంటానికి అని అంగ వికలంగా బోడిదై బీటలుదీసి నుంచునివుంది. ఆ గానుగుచెట్టుకు తను దూరమయిందీ, తను గానుగుచెట్టుకు దూరమయిందీ బోధపడలేదు సత్యానికి.

అక్కణ్ణుంచే వుత్తరంగా చేలల్లోగుండా స్వగ్రామం కనుపిస్తూంది. పూర్వం తను పరాయివూరు వెళ్ళి తిరిగివస్తూ యీ మూలనుండే చూసేవాడు. రామయ్యగారి ఎర్రబంగాళా పెంకుల డాబాకు వెనుకగా వంటపాగ తెరల్లోంచి తొంగి చూస్తుండే స్వగ్రామాన్ని, ఆ ఎర్రడాబా కనిపించంగానే ఎంత ఆనందంగా వుండేది వూరు సమీపాన్ననుభవిస్తూ! చెట్లు చుట్టూతా దట్టంగా పెరిగి యిప్పుడా ఎర్రడాబా, ఆ దృశ్యం కనుపించకపోయ్యేసరికి ఒక్క క్షణంపాటు సత్యంగుండె బీటు ఆగింది.

ఏమయినా తన కీ గ్రామంమీద ఏమధికారం వుంది? భూమి మిగల్లేదు. పదేళ్ళనుంచి శూన్యంగా వున్నయిల్లు - అది ముందు ఏక్షణాన్నయినా యితర్లకు చేస్తుంది. ఊళ్ళో చుట్టాలుపక్కాల్తో సానుభూతి సంపర్కాలు పంచుకొనే అవ

కాశం అంతకన్నా లేదు. తనలాగా యిలాంటి స్వగ్రామాలున్న అభాగ్యులు చాలా మంది తోడున్నా రనుకొన్నాడు సత్యం. అయినా వూరి పొలిమేరలోకి అడుగుపెట్టినప్పట్నుంచీ తన ఒళ్ళు అర్థంగాని వుత్సాహంతో చువ్వ వొంగినట్టు వొంగుతున్నది.

గనువులవెంట గొడ్లమందల్ని చూసి నవ్వుకున్నాడు సత్యం, "ఖడే బఖ్డే" అంటూ కొండెజడ సుబ్బాం పరికిణీ ఎగురుకుంటూ పరుగెత్తటం జ్ఞాపకం వొచ్చి.

ఆ వొస్తున్నది పాపయ్యే. తమాషాగా పెద్దవాడయినాడు. దూరాన్నుంచే కళ్ళకు చెయ్యి అడ్డంపెట్టుకుని చూస్తూ వొచ్చి, "అంతా బాగుండారుగా?" మాటవరసకు అడిగినట్లు అడిగి దాటిపోయినాడు పాపయ్య. గొడ్లపిల్లకాయల్నికూడా దాటినాక సత్యానికి అనుమానం కలిగింది యీ మనుష్యులకూ తనకూ దూరం ఏర్పడిందని.

స్వూళ్ళోకి ప్రవేశిస్తూనే భావయ్యగారింటి ముందరదృష్టి ఆగింది సత్యానికి. ఆ పొడుగుపాటిఅరుగుమీద భావయ్యగారు కనుపించకపోవడం శుభశకునం కాదు. స్వూళ్లోకి ఎవరు ప్రవేశిస్తున్నా ఆయన్ని తప్పించుకోవటం కష్టం.

"ఏవూరు?"

"ధలానివూరు"

"ఏం పనిమీద వొచ్చారు?"

"ఇదిగో వెంకటప్పయ్యగారి పొలం బేరాని ఎలకల్ని తెలిసింది — ధరెంతో కనుక్కుపోదామనీ——" చి మెల్లిగా

"చాలా ప్రయాసపడి వొచ్చారుగాని మాప్రాణాల్లో చెడిపోయిన వాళ్ళేం వున్నట్టు లేదే! మీరు పొరపాట్న దారితప్పి వచ్చినట్టుంది. అబ్బే! యిక్కడ అల్లాంటి వేంలేవు గానీ తమరు వెంటనే తిరిగి వెళ్తే పదకొండుగంటలబండి అందుతుంది. దయచెయ్యండి."

ఆయన భావయ్యగారు! మసిమిసింహా లుంటయ్యని ఎవరికయినా నమ్మకం కుదరకబోతే ఆ ఎత్తాటి గోడలముందర పొడుగాంటి అరుగుమీద కూచున్న భావయ్యగార్ని చూచిన మరుక్షణం నరసింహావతారం భావనలోకివచ్చి భక్తితో అడుగు వెనక్కి వెయ్యటం కద్దు.

"యీయింట్లో ఎవరూ లేరేం!" చెరువులాంటి భావయ్యగారిల్లు ఎండినట్లుంటం చూసి పక్కగా బెల్లం నాక్కుంటూ తన నోకంట కనిపెడ్తున్న ఒడ్డెపిల్లవాణ్ణిచూసి అడిగాడు సత్యం.

"ఓరూ లేరుగా." అన్నాడా పిల్లవాడు సత్యాన్ని యింకొంచెం ఓరచూపు చూస్తూ.

"అదే అడుగుతున్నా - ఏమయినారు ?"

"భాగాలు పంచుకొని బత్తీలమీనకు బోయ్యారు భావయ్యగోరు సావంగానే —" అని తుర్రున పరుగెత్తాడు ఒడ్డెపిల్లవాడు, గభాల్న బెల్లంగడ్డ నోట్లోవేసుకొని ఎగురుకుంటూ.

భావయ్యగారు చచ్చిపోయినట్లు ఎప్పుడో ఎవరో తనతో చెప్పినట్లు చప్పున సత్యానికి స్ఫురణ కొచ్చింది. అప్పుడు తనా మాట నమ్మినట్టు లేదు.

ఊళ్ళోకి పోతూ జరిగిన ఒక్కొక్క మార్పూ సత్యం గమనించాడు. ఇన్నాళ్ళూ పొలం అమ్మకంలో నాన్నకు

సాయపడ్తూ వొస్తున్న వెంకటప్పయ్యగారికి కనుపించి మాట్లాడి రంగమ్మగారింట్లో భోజనంచేసి యింకో రెండురోజులకు వారం చెప్పుకున్నాడు. ఇల్లు మొహం ఒక్కసారి తొంగిచూసి కొంచెంసేపు ప్రయాణపు బడలిక దీర్చుకొని తిరిగి ఫ్యాక్టరీకి వద్దామని బయలుదేరేసరికి సుబ్బులు ఎదురుగా వొచ్చాడు.

తనని చూడంగానే సుబ్బులు కావలించుకుని ఏడ్చినంత పనై, చిన్ననాటి స్నేహాన్ని ప్రకటించినందుకు స్వేచ్ఛగా శ్వాసాడ్డం మొదలుపెట్టినా, తనతో చదువుకున్న భావ న్నారాయణా, వెంకట్రత్నం, వెంకట్రామయ్యలు తనను చూసీ చూడనట్టు పోవటంకూడా సత్యం గమనించకపోలేదు. సత్యంవెంట పోవటానికి సుబ్బులు సందేహించలేదు.

తాళందీసి యింటి బాహ్యస్వరూపం చూడంగానే కాళ్లు కీళ్ళు ఒక్కసారి స్వాధీనం తప్పినట్లయింది సత్యానికి. అక్కడంతా పచ్చపచ్చటి రంగులు తనని ఆహ్వానిస్తయ్యని సత్యం భావించక పోయినా గోడల్ని నెర్రెలుచేసుకుని పిల్లమర్రివృక్షాలూ, నేలంతా బీటలు తీసివుండడం — ఎదుర్రొమ్ములో ముల్లుకర్ర పొడిచినట్టయింది సత్యం హృదయానికి.

మూడుగదులూ, ఒక హాలూ, వంటిల్లూ చూసేలోపల ఒక గుమ్మడిగింజల త్రాచుపామునూ, బారెడు జెర్రిపోతు పిల్లనూ, రెండు తండ్రీకొడుకుల మండ్రగబ్బల్నీ, మూడు ముచ్చుతేళ్ళనూ పారలు పలుగుల్తో గోడవతలవేసి, యింతా కుల చాపలో పరధ్యాన్నంగా ఉన్న పంచకొక్కులు, ఎలకల్ని తూములగుండా అదిలించి, సాలీడు వ్యూహాల్ను౦చి మెల్లిగా

– ఆవిరిగక్కుతూ – పంచలో గచ్చరుగుమీదకి వచ్చిచేరారు సత్యం సుబ్బులు.

"మీాయిల్లు ఓ చిన్న చరిత్రను నిర్మించిది" అన్నాడు సుబ్బులు.

"సిగరెట్టు యింద కొంచెం మనసు తేరుకుంటుంది."

సిజరు పెట్టి బయటకు తీసి, రెండు సిగరెట్లకు నిప్పు ముట్టించాడు సత్యం.

"ఇంతకూ యీావ్వారు నువ్వు ఎందుకువచ్చినట్టూ? పోయినవాళ్ళు ఎందుకురా మళ్లీ యిట్లా వొస్తుంటారు మధ్య మధ్యా?"

"నాన్న పొలం వ్యవహారాలు తగిలించాడు"అని దాటేసి మనవూరు యింత మారిపోయిందేంరా సుబ్బులూ!" అనడిగాడు సత్యం.

''మనుషులు మార్తుంటే వూళ్ళూ మార్తాయి''

''ఏదో పురాతన శిథిలాల్ని చూస్తున్నట్టుంది.''

''నువేదో గ్రాంధికంలో మాట్లాడుతున్నా వేమిటి — గొరిగించిన మొహంలాగా వుందను!''

''ఏం జరిగిందీ యీా పదేళ్ళలో! ఏ గడపలోనూ జీవం కనుపించటంలేదు; లేక గడిచిన రోజులు గొప్పవని వూహా మటుకేనా?''

''నేను వూళ్ళో వుండేవాణ్ణి గనక నీ మనస్సులో ఎట్లా అనిపిస్తున్నదీ తెలుసుకోవటం కష్టంగాని – మార్పు లున్నయిలే.''

"బహుశ చిన్నతనపు స్వేచ్ఛ - ఏ యావలు లేకుండా ఆటల్తో గడిపినట్లు వయసు ముదుర్తున్నకొద్దీ ఏర్పడే జంకుతనం కూడా యిట్లా భావించటానికి కారణమై వుండొచ్చు. సంపర్కాల విషయంలో యావలు ఎక్కువై మనుష్యుల్లో మార్పు వొచ్చిందనుకున్నా యిళ్ళ మొహాల సంగతేమిటి? పూర్వం దిష్టి గుమ్మడికాయలున్నా అందంగా వుండేవి."

"అంతదాకా దేనికి, మీ యింటి సంగతేమిటో చెప్పనోయ్?"

"వొరేయ్ సుబ్బులూ, స్వగ్రామంలోకన్న పరాయి గ్రామంలో ముసలైతున్నదానికి తేడా వుందిలేరా. మాకంటే సరే ముద్రపడింది. కాస్త పచ్చపచ్చగా పాడీ, పంటా వుండే యిక్కడేం చీడపట్టింది అంతా బూజువాసన కొట్టుకుంటూ? కనకయ్య వీధిలో ఒక్క పురుగులేదు. ఆశ్చర్యంగా వుంది! మన చిన్నతనంలో ఆ వీధిలో యిరవైనాలుగు గంటలూ వెలుగులేని వ్యవధి నెరుగుదువా నువ్వు?"

"ఒరే తండ్రీ, నీకిక్కడి సంగతులు కొన్ని తెలియవు. వెంకటేశ్వర్లుగారు పోయినాడు. వెంకటసుబ్బయ్య పొలం అప్పుల పాలైనాక పిచ్చెత్తి ఆ గనుప్పుల వెంట తిరుగుతుంటాడు. బ్రహ్మయ్య కూతురు లేచిపోతే మొహంచెల్లక బయటికిరాడు. వెంకయ్యమామ మర్రిచెట్టుక్రింద సోడాకొట్టు పెట్టుకుని అక్కడే నిద్రపోతుంటాడు. ఇహ మిగిల్నవాళ్ళకు యీ గాలి సోకిందో ఏమో, ఎప్పుడూ బయటికీ లోపలికీ తిరుగుతుంటారు. మరి ఎప్పుడు చూసినా ఆ అరుగులమీద కుక్కలు పడుకుని పిచ్చాపాడీ మాట్లాడుకుంటుంటయి. ఒకనాడు నేను స్వయంగా

చూశాను, ఒక కుక్క ఆ వీధి చివరికి తొందరగా వెళ్ళాల్సి వొచ్చి ఒక్కొక్క అరుగూ ఎక్కి దిగుతూగాని ఆ వీధి చివరికి చేరలేదు. అసలుసంగతి ఆ దరిద్రపు సూచనలకు మీ కుటుంబం యిక్కడ నుంచి లేపటం ఒక వుదాహరణేమో!"

నాన్న అప్పుడప్పుడు యిక్కడి సంగతులు టూకీగా చెవిన వేసినా — మనిషిని మనిషి తాకి స్పర్శననుభవించినట్టు స్వయంగా చూసి కలుగుతున్న అనుభవంలాగా లేదప్పుడు.

"వెంకయ్యమామకేం — శాస్త్ర బాగా వున్నవాడుగా? సోడాషాపు గతేంబట్టింది?"

"ఒరే, దౌర్భాగ్యానికేంరా? వాతావరణంతో కొట్టుకు వొస్తుంది! ఈ కొంపలన్నిటికీ ఏదో గాకుండా యిట్లా ఏడుస్తుంటయ్యా! యిదుగో, పుటికిక్కిన ఎవర్తెనన్నా అనేవు నే చెప్పినట్టు. ఈ వెంకయ్యమామ మూడో పెళ్ళికి దిగొద్దంటే విన్నాడూ? వున్నట్టుండి అమ్మగారికి ఆ బ్రహ్మచారిలో బ్రహ్మత్వం కనుపించింది. పోనీ, యీ వెంకయ్యమామ ఆ వున్నదేమో వస్తురూపంలోనన్నా వుంచుకున్నాడా? ఆ గదిలో పాతిపెట్టిన సొమ్మంతా పరబ్రహ్మకు నైవేద్యం చేస్తూ రోజూ యిల్లలికి ముగ్గులు పెట్టేది, వెంకయ్యమామ పసిగట్టటానికి వీల్లేకుండా. ఒకనాడు మంచినక్షత్రం చూసుకుని ఆత్మసంతృప్తికి వెంకయ్యమామ యిట్టే బిందెను జూసి — మహుఘుడియలో సోడా షాపు పెట్టుకుని — అక్కడే నిద్రపోతున్నాడన్నమాట మృచ్ఛకటికంలో మాదిరి."

"ఛా!"

"యిహ నీవొంతు యిప్పుడు చెప్పిందంతా మరిచి పోవటం"

"ఆఁ, ఎవరికి తెలియకుండా వుంటయి యివన్నీ ?"

"తెలుస్తే బ్రహ్మచారి రోజూ మర్రిచెట్టు కింద కెళ్ళి సోడా తాగొస్తాట్రా ?"

"అదొక సరసమేమో ?"

"చచ్చుపీనుగ లొక్యాలన్నా - గడసన్నా తొక్కి సచ్చే వాడుగాదు యీ వెంకయ్య".

"అంతమటుకు అదృష్టమేలే వుంటే . అన్నట్టు పెద నాన్న — ఆంజనేయులు పెదనాన్న ఎట్లా వున్నాడు ?"

"యిల్లెక్కి కూస్తున్నాడు."

"ఆఁ — ?"

"కనకయ్య వీధిసొమ్మంతా ఆంజనేయం అయిందంటే నమ్మ; మరి ఎప్పుడు జూచినా రామాలయంలోగాని కని పించడు. వేలిముద్రల మీద వ్యవహారం నడిపాడనుకో."

"అంటే ?"

"అంటే ఏముంది? అప్పుగా నిచ్చిన సొమ్ము రిజిస్ట్రా రాఫీసులో వేలిముద్రలతో భూమి అవతారం దాల్చి తిరిగి వస్తుందన్నమాట."

"మళ్ళీ అంతా దగ్గర బంధువులే !"

"ఘట్టిసొమ్ము గనుక పరాయివాళ్ళకు దక్కలేదు. ఇహ నువ్వూ, నేనూ విచారించటం దేనికి ?"

"అంతా మాయగా వుంది ! ఇందాక రంగమ్మత్తయ్య గారింట్లో భోంచేసేటప్పుడు నీళ్ళమజ్జిగ పోస్తుంటే. పల్లెటూళ్లో-

అందుట్లో రంగమ్మత్తయ్యగారింట్లో ఎన్నాళ్ళను గడ్డపెరుగు తింటున్నామా అని ముందుగానే వూహాలు - జరం తగిల్నట్టయి నేనుంటే - ఆ నీళ్ళ చుక్కలకే జనం ఎగబడ్తున్నారని ఆవిడ చీమ కుట్టినట్టు అంటుంటే ఎంతాశ్చర్యం వేసిందో నువే ఆలోచించు."

"ఆలోచించే దేమిటి, మనం యిందులో పండిపోతే. ఇంకా నయం! నువు అసలు గ్రామరాజకీయాల సంగతే తెలియకుండా పైపైవాట్ని గురించి స్థూలాభిప్రాయాలిస్తున్నావ్. మొన్నీమధ్య మన రత్తయ్య పెద్దమనిషితరహాకు వుంచుకుంటున్న రంగయ్య భార్య నాగరత్తమ్మ యింటోనుంచి అర్ధరాత్రి బ్రాహ్మణయ్య నెత్తిన ముసుగుతో తలుపు తెసుచుకుని బయటికి రాబోయ్యే సమయంలో-అదే విధానంలో తలుపుగొట్టే ప్రయత్నంలో గుమ్మంలోనేవున్న రత్తయ్య తారసిల్లాట్ట. మర్నాడు బ్రాహ్మణయ్య ఏడి ఏడని వూరంతా గాలించి, యిట్లా జూస్తే వూరిబయట బండల దొడ్లో రెండు చాకలివాళ్ల గాడిదెలచాటున దిశమొలతో ధ్యాననిద్రలో కూచుని వున్నాట్ట. తెలిసిందా ?"

"నువు చెప్పింది జీర్ణించుకుంటానికి కొంత వ్యవధి పడ్తుందిరా సుబ్బులు తండ్రీ !"

"నాకు కామయ్యతో తొందరపనివుంది. మళ్ళీ ఆనక్కకలుసుకుందాంలే. పోయి వస్తా"నంటూ వెళ్లాడు సుబ్బులు.

తన వూరును గురించి ఒక అభిప్రాయానికి వొచ్చేసరికి సత్యానికి కునుకుపట్టింది ప్రాణి అలిసివుంటంవల్ల.

ఆ విధంగా తను ఎంతసేపు పడుకొన్నాడో - ఎక్కడో లాకులు తెసుచుకుని నీరు ప్రవహిస్తున్నట్టు - "ఏమండోయ్

స_త్తిమియ్యాగోయా!" అని ఎవరో తనను పిలుస్తున్నట్టనిపించింది సత్యానికి. కలలో గొంతులు లాక్కొంచి తప్పించుకున్న నీటి లాగా వుంటయి గావాల్ను అనుకుంటూన్న సత్యానికి మళ్ళీ "యిదేంది యాలగానియాల నిదరబోతుండాడూ!" అన్నట్టయి, గభాల్న కళ్ళు తెరిచి చూశాడు – ఆ మనిషి ఎదూరుగా నుంచుని వుంది.

"నేను మాలచ్చిని –" అన్నదా మనిషి కడియాల చప్పుళ్తో. సగం నోరు తెరిచి మూసుకున్నాడు సత్యం.

"కొండడు మియ్యిం సెపటాకాడ సూశాడంటా — సెప్పాడు" అన్నది.

పదేళ్ళక్రిందట మా యింట్లో పనిజేసేది మహాలక్ష్మి. ఎట్లా పెరిగింది!

"అంతా బాగుండారా—అమ్మా, నానా—యింకా నిదరమైకం వొదల్లే దెట్టా!"

"ఏం మహాలక్ష్మి—" నిద్రపోయేవాణ్ణి గబగబ లేపి నీళ్ళు పాస్తున్న నారుమళ్ళ మధ్యన కూచోబెట్టినట్టయింది సత్యానికి.

"గురు తుండదా!"

"వుంది. నిద్రపట్టింది—"

"యిదేంది, లెగిసి కూకుని మళ్లీ అట్టంటాడూ!"

"అదికాదు. నిన్ను చప్పున గుర్తుపట్ట లేకపోయినా—" అంత పెద్దదయినా మహాలక్ష్మిలో మార్పు లేకుండా అదే విధంగా మాట్లాట్టం చూసి సత్యం కాస్త తికమకలో పడ్డాడు.

"బలే వోరండీ!"

"నుంచున్నావేం కూచో."

"అబ్బో, ఎల్లాలండీ, ఆయన నొచ్చే యాలయిందీ. అమ్మోళ్ళంతా బాగుండారుగా?''

"ఆ, వున్నా రట్లా—నీకు పెళ్ళయిందా?''

"అప్పుడే అయిందిగా!''

"పిల్లలా?"

"ఆఁ, ఆళ్లుకూడా దేనికి లెండి, మొగులే కూటికి కనా కష్టంగా వుంటే!''

"అదేమిటి – నీ మొగు డేం పని చేయడా!''

"మొగు డొక్కడే ఏం కర్మ! యిద్దరం జేత్తుండా అంతంత మాత్రంగానే వుంది. యిదుగో, ఏవంటారోయ్, ఎనక మీయింట్లో పనిజేసే దినాల్లోనే బాగుండదండీ! యిప్పు డంతా బొహు దరిద్రం గుండది."

"మరి పెళ్ళంటే ఏ మనుకున్నావే?'' అని చూశాడు సత్యం.

"ఆయన కేవంటారోన, సానా మందొడయితే – మీాకు తెలవదు గావాల్ను? – కూలిగింజ లీయక సానా ల్దేసుకు తింట న్నారండీ.''

"ఎవరూ?'' డబ్బులకు కాదుగదా అనుకున్నాడు సత్యం.

"ఎవ రేంది, ఆసాములు కాక యిం కెవ రుంటారూ? యిదేందండీ, నా ల్లేసినా, కోతగోసి కుప్పలునూర్చినా, గింజలు కొలవక డబ్బిత్తా నంటా రేందండీ! ఆ డబ్బులు కాత్తా కోవి టాయన దగ్గిరికి తీసికెళ్ళి గింజలు కొలవమంటే నాలుగ గుప్పిళ్ళు వొళ్లో దులిపి పోమంటున్నాడు. ఇదేం అన్నాయ

మండీ, యిన్నాళ్లూ మాగూడెంమడుసులు యిట్టాటివి ఏమన్నా ఎరుగుదురా?"

"అదే నాకు బోధపడకుండా వుంది!"

"శాకిరి సేసేదంతా మేమూ — గోతాల్లో పోసేది, పొయ్యాక తలికే గింజలు కానాకుండా సేసి ఏడిసిచ్చుకుతింటుం డాపు. మా కూలోళ్ళను పస్తుపొనుకోబెడ్తే ఆళ్ళ కేం లాబం వొచ్చుద్ది మీరే సెప్పండి? మా గూడెంలో మడుసులు ఎట్టుం డారో ఓపాలి వొచ్చి చూడండి మీకే తెలుసుద్ది!"

"అన్యాయం!"

"అన్నాయ మేందీ, మొన్నామద్దె మా లచ్చుమయ్య ముటాం గింజలుకొలుస్తేగాని యీలు లేదనిపేసీపెడ్తే, లచ్చుమయ్యా, లచ్చుమయ్యాకొడుకుని యీపులు పగలగొట్టిచ్చారు — సూశా రంటుండీ?"

"మరి ఎవరన్నా పెద్దమనుష్యుల్తో చెప్పలా మీరూ!"

"ఆ మడ్సు లెవరో ఎవరూ కానారు!"

"ఏదో సద్దుకుని పోవటం వుండాలిగా మరి."

"యింకా సద్దుకునే దేం వుండది, పానం నీలుగారి పోతుంటే! సచ్చేది గూడెంలోనే కూకుని సద్దామని ఏ పనికీ పోకుండా అంతా అటనేగూడెంలో కూకుండారు—కడుపు కాలి పోతుండది."

ఇంతలో ఓ పొడుగ్గాంటి చువ్వలాంటి మనిషి కళ్ళు మెరిపిస్తూ, తుబుక్కున వుమ్మేసుకుంటూ వొచ్చి మహాలక్ష్మి పక్కన నుంచున్నాడు.

ఆ వొచ్చిన మనిషెవరో తననూ, మహాలక్ష్మినీ ఎత్తి నేలకేసి కొడ్తా డనుకున్నాడు సత్యం.

"నేను సుబ్బణ్ణి లెండి" అన్నా డా మనిషి ఒక్కసారిగా నవ్వుతూ.

మహాలక్ష్మి మొహం ఓరగా పెట్టుకుని సుబ్బడి వెనకకు జరుగుతూ నవ్వింది.

"మిమ్మాలగురించి సెప్తావుంటది లెండి – యిహీం!" అని నవ్వాడు సుబ్బడు గిరజాలు వెనక్కి ఎగరేసుకుంటూ.

"కొంచెం పని వుండి వొచ్చా—"యీ మనిషి నవ్వింది గాని మాట్లాడ్డుగావాల్ను అనుకుంటున్నాడు సత్యం.

"గూడెంలో కాత్తె పని వుండడి. దొబ్బున ఎల్లాల. రాయే, దొబ్బునెల్దాం—" అంటూ గబగబ యిద్దరూ చేతులు పట్టుకుని వెళ్ళి పోయినారు.

ఒక్కసారి ఫిలింతెర్తో లైట్లు వెలిగినట్టయింది సత్యానికి. మహాలక్ష్మి ఎంత మారింది! ఎంత మార్పు యీ మనుష్యుల్లో!

తన ఆప్తవర్గంలోని పతనాన్ని వెళ్ళబోసిన సుబ్బులూ, తమ గూడెంలోని మనుష్యుల్తో సమభాగంగా నిలబడి పరుగెత్తుకు వెళ్ళిన ఆ దంపతులూ – ఆ శూన్యంలో తనముందు నృత్యం చేస్తున్నట్టనిపించింది సత్యానికి.



## 'మిల్లులో ముసలాయ్'

శశిరేఖ : అబ్బ ఇంక నేను నడవలేనయ్యా. నాకడుపులో ఏందో సెయిపెట్టి తిప్పుతున్నట్టుంది. ఆ మిల్లు ఇంకెంత దూరంవుందో ?

ముసలాయ్ : నాకు మటుకేం తెలుసుద్దిచెప్పు. దెగ్గిరకి ఒచ్చే వుంటాం అని అనుకుంటున్నా. కాస్తె అటనే ఓపికబట్టి నడిస్తివా దబ్బున మిల్లుకాడికి సేరుకుంటాం. అమగో పొద్దు పొడుస్తున్నది.

శశి : ఆడదానికష్టం మీ మొగాళ్లకేం తెలవదు. చీ. దరిద్రానికి తగినట్టు నాకీ కడుపు బరువుకూడా. అయిదుకోసుల దూరం వుంటుందని సెప్పాడా పెద్దమడిసి. తొలికోడి కూయంగానే బెయుద్దేరినోళ్ళం ఇప్పటికి ఆరుకోసుల పైసిల్కెన్నా నడిసుంటాం. ఏదీ ? యాడా కాన్రాదేం మిల్లు ?

ముస : ఆరుకోసులు యాడ నడిశాం ? నువసలే కడుపు బ్బారంతో కాల్దీసి కాలు పెస్తుంటివి. అబద్దం సెప్పటానికి ఆ ఎంకటప్పయ్యకేం బట్టెంది ?

శశి : ఏం ఎంకటప్పయ్యో. ముక్కు మొగం తెలవని ఈకొత్త సోటుకు ఆశపెట్టి పోమన్నాడు. నాకు తెల్చు. మన అంతు కనుక్కొంటానికే ఈ ఎంకటప్పయ్య జత

పడ్డాడని. అందుట్లో నువ్వు మాటకు ముంగల పెతి మడిసినీ నమ్మి కూకుంటావు. అసలా పంచదారమిల్లు ఈసుట్టు పక్కల పోరపాట్నన్నా వుండదు.

ముస: అది గందుకే మీ ఆళ్ళోళ్ళకు సూత్తేమండేది. ఏపని సేద్దా మనుకున్నా ముంగలగానే నస మొదలుపెడ్తారు. మన ఊళ్ళన్నీ ముదనష్టకమైపోతే దేవుడల్లే ఈ ఎంకటప్పయ్య అగుపించి, బలాన మిల్లుకాడికి పొండి పని దొరుకుతుందని కాత్తె ఊపిరిపోత్తే, చరేనంటే చరే ననుకోని బయిల్దేరొచ్చాం. అయిదారు కోసులదూరం నడవనూ నడిత్తిమి. మరి యాల మిగిలిపోయినాక ఇప్పు డేందంట నీనస. నాలు గడుగులు గబగబా ఏశామంటే ఆ మిల్లు వుండేదీ లేందీ తేలేపోతుందాయె. పైగా పంచదారమిల్లా మిల్లుకు ముందు రాత్తా, పక్కన కిల్లీ దుకానం, ఆ కిల్లీ దుకానంలో రంగయ్యనే ఓ మడిసు టాడనీ, ఆ రంగయ్య నడిగితే మిల్లు యవారాలు తెలుత్తయ్యనీ - ఇంతవైనంగా సెప్పె ఆ పెద్దమడిసి.

శేశి: ఆ సెప్పిందంతా బూటకమని నేను మట్టుకు అనుకున్నా నెట్టా ? నడిసినడిసి తెల్లారిపోయె. మరి తెల్లారకతలికే మిల్లు కాడికి సేరుకుంటామని ఆ పెద్దమడిసి సెప్పె. ఓ పక్కన ఈ కనుపుమోాత. ఇంకోపక్కన ఎనుబోతులల్లే ఈకొండలూ బండలు దారిపొడుగూతా ఎంట పడ్తావుండె. అయినా మూడన్నా పంచదార మిల్లులు, కిల్లీ దుకాణాలు కొండలు బండల మయాన వుంటైటయ్యా?

ముస: ఏ పుట్టలో ఏం పామో, ఏగుళ్లో ఏం మాత్తెంవుంటదో నీకూ నాకూ తెలుచ్చద్దా?

శెశి: మాత్తెం సంగతి దేవుడికెరుక! వొచ్చొచ్చి అడివిలో పడ్డాం. యాడసూసినా మడిసి పురుగు కనిపించటంలా. నాకేదో అనుమానంగానే వుంది. ముక్కు సూటిగా అదే పనిగా నడిసిపోతున్నాం. దారి తప్పలేదుగంబా?

ముస: అదే నాకు తెలవటంలా. అంతా సిత్రంగా వుంది. ఇందాకణ్ణుంచి నేను నీసుమల్లే కల్లు పొడుసుకుసూత్తావుండా ఏమడిసి బొమ్మన్నా కనుపిచ్చద్దేమో నని. నువన్నట్టు నిజంగా ఎవరూ కాన్రారేం?

శెశి: ఇంతపని ఐద్దని నాకు ముందగలే తెల్చు. సచ్చీసెడి సీకట్లో పడి అసలు దేనికయ్యా మనం బయల్దేరొచ్చింది? మనల్ని సెప్పుతీసుకు తన్నాలి ఈ సేసిన పనికి. మనం ఈడ నాలిక పీక్కు సచ్చినా సూసే దిక్కులేదు. నానోరు పొడారుకు పోతుండది!

ముస: పాసం తీస్తివిగదంటే! సచ్చినోణ్ణి నేసన్నా ఒంటరిగా రాక సిన్నుగూడా లేవదీస్తిని గదంటే. ఎట్టసత్తా ఇప్పుడు? కాస్త గబగబ నాలుగడుగు లెయ్యవే ఏదొకటి సేసుకుంటాం.

శెశి: కడుపు కాల్తున్నా మన ఊళ్ళకుపక్కన వుంటుంటే అదో మాదిరిగానన్నా వుండేది. అడివిలో యింకేంటి దిక్కు?

ముస: అవును. ఎంత ఎట్టిశాకిరి సేయించుకుండా ఇంత సింత కాయ పచ్చడో, సద్దన్నమో, పులిమజ్జిగో పోసేవోరు మనూరి మారాజులు. ఆశపీకుతావుంటుంది గనక బయల్దే

రొచ్చాం. అయినా ఎప్పటికైనా మంచిరోజు లొత్తయ్యాని మద్దెమద్దె మనుసులాగుతానే వుంటది.

శెశి: అదే మనకి తెలవదు. మనకి ముందు రోజుల్లో కడుపు నిండా తిండిదొరుకుద్దని తెలుస్తే, నెలరోజులు ఉపాసం వుండ మన్నా వుంటాం. చీ. ఇంక మనూరికి పేరే ఎత్తొద్దు. పానం ఇసిగి పోయింది. అంతకన్న ఈ అడవే నయం. ఏమో. ఈ వజాన పోంగాపోంగా మనకి మంచిరోజులుకలిసి రాగూడ్దా. నా కడుపులో బిడ్డపుట్టంగానే మనకు శెని ఇరగడై పోద్దని నా కెందుకో అనిపిస్తావుంటది.

ముస: ఇరగడైపోక ఇంకెన్నాలే? మనకు పంచదార మిల్లులో పనైతే మనబుడ్డోడు గుప్పిళ్లు గుప్పిళ్ళతో పంచదార తింటా వుంటాడు — ఇహి.

శెశి: అంత ఆశ మనకెందుకులేయ్యా. ఆమాటకొస్తె మనూరి పొలాల్నిండా బంగారం పంటలు పండవ్వా? ఏం సారదకం? నిన్న నన్ను ఒక్కగింజ ముట్టుకోనిచ్చారా?

ముస: బాగా సెప్పావు. అవును. మరి ఇది మడుసుల యవా రంతో కూడిన పనాయెను.

శెశి: అబ్బ! నా కడుపులో తిప్పుతుండదయ్యా, కాత్తె ఆగు. వుండు. ఎవరో నవ్వుతుండారు. దుమ్ములగుండ కాదుగందా? అయి అడవుల్లో వుంటయ్యంట. ఎవరైనా మడుసులు ఒంటరిగా ఒత్తుంటే నవ్వుకుంటూ ఒచ్చి మీద పడ్తయ్యంట!

ముస: సచ్చాన్రా బగమంతుడా. వుండు — వుండు — అగుగో. ఎవరో ఇద్దరు గొల్లమడుసులు పెసుగుతట్టల్తో ఇటుగా ఒస్తుండారు.

శెశి : ఏరీ - ఏరీ! అమ్మ బతికాం. ఈ బండలసాట్న ఎవు రుండదీ తెలవాలంటే బెమ్మదేవుడు దిగి రావాల్సిందే.

ముస : ఓగొల్ల తట్టమ్మోవ్! ఓ మిమ్మ ల్నేనమ్మోవ్! మిల్లు ఈడకి ఎంత దూరం వుంటదీ?

1 గొల్ల : తట్టమ్మా? ఎవురయ్యోవ్ నువ్వా? తట్టమ్మ బుట్ట మ్మంటున్నావే! కళ్ళు కాన్రాటల్లేదయ్యా?

2 గొల్ల : నెత్తిన తట్టవుంటే ఎవురికైనా అలుసే ఈ రోజుల్లో. మనేపు మొగాలు కాదల్లేవుందే!

ముస : తెలవక నోరు జారిందిలే. పేరు తెలవదు గందాఅని...

1 గొల్ల : దారేపొయ్యే ఆడగూతుర్ని మర్రాదగా పలకరిచ్చ టానికి పేరూ ఊరూ తెలవాలెట్టా? ఏ పూరు నాయనా మందీ ?

శెశి : మాది పరాయి ఊళ్ళమ్మా. ఎగతాళిగా పలకరి స్తే మాకేం ఒరుగుద్దీ. మీకు పున్నెం వుంటది పంచదార మిల్లుకు ఎటుగా పోవాలో కాస్తె సెప్పండమ్మా.

2 గొల్ల : మాకెందుకులేమ్మా మీ పున్నెం. దేనికీ పంచదార మిల్లా? ఆడ మీ కెవురన్నా వుండారా?

శెశి : అబ్బే ఎవురూ లేరు - ఊరకనే -

ముస : ఊరకనే దేనికీ? పనేవన్నా దొరుకుద్దేమోనని ఎల్తుం డాం.

1 గొల్ల : ఓ యబ్బో సానాదాకా వుందే యవారం?

2 గొల్ల : ఆడ పనిజేసే మడుసులు సానామంది వుండారే. ఆళ్ళు సాలక ఇంకా మీరు గూడా దేనికీ? మీరేమన్నా ఇంజన్లు నడిపిత్తారా?

1 గొల్ల : ఆ. నేనూ నడిపిస్తా పింజను ! ఓ అక్కోవ్. ఈ జన మంతా ఎల్లి ఏంజేత్తారో తెలుసా ! ఆడ మిల్లులో పనోళ్ళు రూపాయి పావలాకే, రూపాయి కూలికి పనిచేస్తుంటే ఈ రెల్లి అర్ధరూపాయికి, ముప్పావలాకి చేస్తామని ఆళ్ళ నోట మట్టిగొడ్తారు.

ముస : అదేమో మాకు తెలవదు. నాయంగా పనిసేసుకు బతికటానికొచ్చాం.

శెశి : మాతిప్పలు మేం పడ్తాంలేమ్మా. మీమేలు మరిచిపోం, మిల్లు ఎట్టాగా వుందో సూపించి ఎల్లండి.

2 గొల్ల : అదిగోం — ఆ తాటితోపు ఎనక మూలగా కనిపించే దేగా మిల్లూ. గొట్టంలోంచి పొగరాటం కనుపించటంలా ! పొద్దెక్కింది రావే ఎల్లిపోదాం.

శెశి : అబ్బ ! ఎంతపెద్ద పొగ్గొట్టం !

ముస : అబ్బో. తాడిసెట్టు తలదన్నిందే !

... ... .. ...

మిల్లుహాలు - ఒప్పందము

సింహా : రంగయ్యోవ్ ? మిల్లుకూ తేసింది డబ్బున నాకో అర్ధణా బీడీలివ్వు - జల్దీ.

తిరపతి : ఆసేత్తోనే నాకో చార్మినార్ పెట్టోటి పారెయ్ రంగయ్యా ?

సింహా : ముందర నాకు.

తిరపతి : అంతకన్నా ముందరనాకు.

రంగయ్య : ఏదీ డబ్బు రానీండి.

సింహా : ఇవాళేం కొత్తగా మాట్లాడుతున్నాడే రంగయ్యా ?

తిరపతి : నీ డబ్బులుకోసం ఈ మిల్లులోంచి మేమేం పరారై పోంలే రంగయ్యోవ్. అప్పుపెట్టటం, బట్వాడా రాంగానే తీర్చుకోటం మనలో మనకు వాలీవుందిగా ? ఇచ్చేయ్.

రంగయ్యా : ఈమాటలకేంలే. బట్వాడా ఇచ్చిన రెండు రోజుల్దాకా మొహాం తప్పించి మళ్ళీ అప్పులకు ఎగబడ్తారు.

సింహా : మేం ఎప్పుడైనా నీకట్టా చేశాంటయ్యా రంగయ్యా ?

రంగయ్యా : మీరంటే మీరుకాదనుకో. ఆ పానకాలు ఏం చేశాడో తెలుసా ? బట్వాడా ఇచ్చిన మూడు రోజులు సిలుస్తున్నా మొహాం తప్పించాడు. నాలుగో రోజున ఆ ఫోరుమన్‌తో జగడం పెట్టుకుంటే పనిలోంచి తీసేశారట - ఇహ మొహమన్నా చూపించకుండా అదే పోత పోయినాడు. రూపాయిన్నర సున్నా.

తిరపతి : మరింకేం ? ఆ పాపం మేంగాదుగా చేసింది ? ఇచ్చేయ్ టైమైపోతున్నది.

ముస : రంగయ్యా కిల్లీ దుకాణం ఇదేనంటండీ ?

శేశి : మాది పొరుగూళ్లే బాబూ. ఓ పెద్దమడిసి ఈ దుకాణం కాడికెల్లి మిల్లు చంగతులు ఇశారిచ్చమంటేనూ అడుగుతున్నాం.

రంగయ్యా : ఏం ? ఏంపనిమీద ఒచ్చారూ ?

ముస : మిల్లులో పనేదన్నా దొరుకుతుందేమోనని పదికోసుల దూరాన్నుంచి గంపడాశతో ఒచ్చాంబాబూ.

సింహా: ఇంకేం. రైటయిన పనిచేశారూ! ఏం పీక్కు తిందా మనయ్యా ఇంతదూరం పడొచ్చారూ? ఇన్నాళ్ళనుంచి మేం పీక్కుదింటున్నాంగా.

తిరపతి: కొత్తవాళ్లను హడలగొట్టబోకురా సింహాచలం. ఇదిగో నీపేరేంటీ.

ముస: నాపేరు ముసలాయండీ.

శెశి: నాపేరు చెశిరేకండీ.

సింహా: పోనీలే. మిల్లులో ఏంపని చేస్తామనొచ్చారూ?

ముస: కడుపు నిండటానికి ఏపనైతే ఏం బాబూ - పనే దొరకాలగానీ.

శెశి: తిండిలేక అల్లాడిపోతున్నాంబాబూ. ఏ కూలిపనో ఇప్పిస్తే మీపేరు సెప్పుకు బతుకుతాం.

సింహా: ఇదిగో, ఈ మిల్లుకు నేనే మేనేజర్నయితే మీకు రోజుకు చెరో రెండు రూపాయిల కూలిప్పిస్తా.

తిరపతి: నోరు ముయరా సింహాచలం. వాళ్లూ మనలాగే కడుపు చేతపట్టొచ్చారు. వాళ్లతో నంట్రా నీ ఎగతాళీ?

రంగయ్య: ఇదిగో ముసలయ్యోవ్? పిల్లి దరిపి పోచికోలు కబుర్లు. మీమాదిరే మిల్లులో కూలిపని చేసుకుంటున్నారు. మిల్లులో మేనేజిరుగారున్నారు. ఆయన్ని కలుసుకుంటే, మీ అదృష్టం బాగుంటే ఏదన్నా కూలిపని దొరుకుతుంది.

సింహా: రంగయ్యా? నీ తలకాయ కాస్తై చిన్నదని మిల్లులో అనుకుంటుంటే ఇన్నాళ్లు మేం నమ్మలా. ప్రతిరోజూ నన్నూ, ఈ తిరపతిని మిల్లు దగ్గర చూస్తున్నావు. ఎవరు ఎవరయిందీ ఇంకా నీకు తెలవకబోయె. ఇదిగో మల్లీ

చెబుతున్నా ఈ తిరపతి గాస్ సెల్లర్, నేను మిషన్ క్లీనర్ని – తెల్సిందా?

రంగయ్య: ఆ, నిక్షేపంగా తెల్సింది. మీరేమన్నా ఇంజనీర్లా – ముందు చెప్పండి? మరింకేం. నెల జీతగాళ్ళా? కాదుగదా. రోజుకూలి వారానికోసారి తీసుకుంటారు – అంతేనా? కాకపోతే బస్తాలు మోసే కూలివాడికన్న ఇంకో అర్ధ, ముప్పావలో ఎక్కువ సంపాదిస్తారు–అంతేగా తేడా?

సింహా: రంగయ్యంటే ఏమో అనుకున్నాం గదరా తిరపతి. పెద్ద యవహారస్తే! ఇదిగో రంగయ్యాన్? మమ్మల్ని పనితనం వున్న పనివాళ్ళని పెద్ద పెద్ద వాళ్ళంటారు గానీ నీవు కూడా మమ్మల్నోకంట చూస్తావున్నావు. ఏమైనా నిన్ను మా మిల్లులో ఎగ్జామినేషనికి సిపార్సు చెయ్యాల్సిందే.

తిరపతి: ఎగ్జమస్తా కూడా మన రంగయ్యముందర బలాదూరే. ఈ మధ్యనుంచి రంగయ్య కూడా మన జనరల్ మేనేజర్లు, ఇంజనీర్ల గారి మీద చెప్ప వాలటంలా. మన ఇంజనీరుగారబ్బాయి రోజూ రంగయ్య కొట్టుకాడికే వచ్చి లెమ్మొనడు తాగి, గోల్డుఫ్లేక్ సిగరెట్లు జేబులో వేసుకు పోతున్నాడంట. కాదంటయ్యా రంగయ్యా?

సింహా: ఒరేయ్, ఇంజనీరుగారబ్బాయి గేటుదగ్గర తచ్చాడుతున్నాడు. ఇలాగా వస్తాడల్లేవుంది మనకెందుకొచ్చింది పద పోదాం – తాజిమహాల్ బీడీ లేవయ్యా రంగయ్యా?

తిరపతి: చార్మినార్ పెట్టె అట్టాగే చేతిలో పట్టుకుంటివే! ఏదో మాటమీద మాట తమాషాకు అనుకుంటాం పోతాం—రానీ రానీ.

సింహా : మరి ఈ ముసలయ్య సంగతి ఎమంటాంవురా తిరపతీ ? తిండి తిన్లేదు గావాల్ను చూండు మొహాలు ఎట్ట పీక్కు బోయినయ్యో ?

తిరపతి : కూలిపనేమన్నా దొరకవచ్చనుకుంటా? రత్నం మేస్త్రీని అడిగి చూద్దామా ?

సింహా : వాడుత్త దబ్బెం రకమే ! నువ్వు మాట్టాడేది మాట్టా స్తుంటే వాడు అరచెయి ఆడిచ్చేదీ ఆడిస్తానేవుంటాడు, తైలంకోసం.

తిరపతి : అబ్బో అట్టాటిరకం తమగైతే మిల్లులు నడవకేం ? కానీ అడిగిచూద్దాం. మనమంటే కొంచెం గురేలే. ఇంజ నీరు గారబ్బాయి ఇటే వస్తున్నాడోయ్. పదపోదాం. ఇదిగో ముసలయ్యోవ్ మధ్యాహ్నందాకా. యిక్కడే వుండండి. ఇంటర్‌వల్ గంట కొట్టంగానే బయటికివస్తాం. వస్తాం రంగయ్యా - వాళ్ళకి కాస్తేమన్నా పెట్టవయ్యోవ్- పదరా సింహాచలం.

ముస : ఇసిత్రమైన మనుసులు !

శేశి : మిల్లుకాడ ఇసువంటి మనుసులుంటారని నేను కల్లో గూడా అనుకోలా ! ఆ మాత్రం మాటమంచుంటే అంతే సాలు.

రంగయ్య : కొంపదీసి వాళ్ళమాటలు నమ్మేరు ! నేను ముందర చెప్పిందేరైట్. ఎప్పటికైనా మేనేజరంటే మేనే జరే ! అయినా మీ అదృష్టం ఎట్టావుంటుందో నేనేం చెప్పగల్ను ?

.......................

మేస్త్రీరత్నం: ఏయ్ ఒంకరకాళ్లా! ఇట్రా?
ముస: నన్నేనండి పిల్చిందీ? నా పేరు ముసలాయండి మేస్త్రీ గోరూ.
రత్నం: నిన్ను కాకపోతే ఎందుకుసలికా? నీవి ఒంకర కాళ్లేనా?
ముస: అయితే ఏంలే మేస్త్రీగోరూ, మడిసి కోలోఉంటది. అట్టా అని ఎవర్నన్నా అంటే కష్టంగుంటది.
రత్నం: నువీ మధ్యబాగా నే మాట్లాడుతున్నావే! ఒచ్చిన మొదట్లో నీకు మాటలు రావనుకున్నా. అయినా నీకీమధ్య ఒళ్లు బలిసిందటరా? లాకర్లోకి బస్తాలు సరిగా మొయటం లేదని నీమీద కంప్లయింటొచ్చింది. ఏమంటా? ఆ మనిషి నీ పెళ్లాం కాదూ? ఏయ్ ఇట్రా?
శశి: దణ్ణాలండి మేస్త్రీగోరు.
రత్నం: నిన్న ఆ పైపులు స్టోరురూములో పడేసి రమ్మంటే గోడవున్లో పడేశావుట. కళ్లేం నెత్తికెక్కినయ్యా?
శశి: ఏది యిస్టోర్సు, ఏది గోడావునయిందీ తెలవక తికమకైంది దొరా. ఈ సారి ఇంకెప్పుడూ సెయ్యను గా.
రత్నం: ఏరా నీ పెళ్ళాన్ని పొద్దునే ఓ అరగంట పాదిపనికి పంపించమంటే పంపటం లేదే?
ముస: తమకు సెప్పలేదుగాని మా ఆడమడిసికి ఎన్నినిదో నెలండి దొరా. కడుపులో తిప్పుతావుంటుందంట.
రత్నం: ఏడ్చావు. ఇక్కడేం పనికేం తిప్పటంలా? సరే చూస్తాను మీ సంగతి. మీ మీద ఇంకా చాలా కంప్లయింట్సు వున్నయ్. నిన్న బట్వాడా తీసుకున్నారా?
ముస: చిత్తం, తీసుకున్నాం.

రత్నం : మరిచి పోయినా రనుకున్నా లే. మీ రిద్దరూ ప్రతి బట్వాడాకో నాకు రెండు రూపాయలు ఇవ్వాల్సుంటుందని మీ కెవరూ చెప్పలా ?

ముస : బీదోళ్ళం, మన్నించాలి దొరా. కొత్తోళ్ళమని నాకు పద్దాలుగణాలు, మా ఆడమనిషికి ముప్పావలా ఇస్తుం డారు దొరా.

రత్నం : సరే నాకెందుకొచ్చింది. మీ మీద కంప్లయింటిచ్చి మేనేజరుగార్కి రిపోర్టుచేసి ఈ గొడవంతా వార్నే చూసు కోమంటా.

ముస : మీ కాళ్ళకు మొక్కుతాం, రచ్చించండి.

తిరపతి : ఏం రత్నంమేస్త్రీగారూ, బాగున్నారా ? అరే ! ఈ ముసలాయి దంపతులు యిక్కడే వున్నారే ! ఏం అట్టా మొహాలు వేళ్లాడేశారు. మేస్త్రీగారు ఏదో కేక లేస్తున్న ట్టుందే ?

సింహా : మన మేస్త్రీగార్కి ఈ దంపతులమీద ఇంకా దయ కలగ లేదని కూలిజనంలో అనుకుంటున్నార్ట తిరపతీ.

తిరపతి : నిజంగారా సింహాచలం ? పాపం వీళ్లు చాలామంచి వాళ్లండి మేస్త్రీగారూ. అయినా మన మేస్త్రీగారికే స్వయంగా తెలుసుకుంటారు మనకెందుకు.

రత్నం : ఆ మెళుకువలన్నీ నాకు బాగా తెలుసు. మరి ఇన్నాళ్లు ఈ ముఠాలో పని చేయిస్తున్నాను. అయినా ఈ గొడవలన్నీ మీ కెందుకు లే ? పో రేంరా ముసలాయ్ ? మీ కేంపన్లు లేవూ ? కాస్త ఒళ్లుదగ్గిర పెట్టుకు బతకండి.

తిరపతి: ఇంతకుముందరే ఇంటకువల్‌గంట కొట్టారండి మేస్త్రీ గారూ, టిఫెన్‌తినాలి. మనంకూడా పోదాం రారా సింహాచలం.

....................

మిల్లు స్ట్రయిక్ - సూచనగా దూరంగా కోలాహలం

ముస: ఈ గడబిడంతా ఏంటి తిరపతయ్యా?

తిరపతి: స్ట్రయికు చేస్తున్నారు.

సింహా: నువ్వు గమ్మునుండరా ముసలాయ్.

ముస: స్టయికా? అంటే ఏంటన్నమాటా?

తిరపతి: అంటే, పనివాళ్లు మిల్లులో పన్లుమానేసి బయటికి కొస్తారన్నమాట.

ముస: అదేందయ్యోవ్! పన్లుమానేసి బయటికొస్తే, మరి పొట్టగడవటం ఎట్టా? వుత్తపున్నానికి నన్ను బయటికి లాక్కొత్తిరీ? ఇదంతా నాకు తెలవదే?

సింహా: నిన్నెవరేం బలవంతాన లాక్కురాలా. పనివాళ్లంతా బయటికొచ్చేశారు, నువ్వూ ఒస్తావా అంటే ఒచ్చేస్తివి. నీకు ఇష్టంలేకపోతే తిరిగి మిల్లులోకె వెళ్లచ్చు.

తిరపతి: మా పనివాళ్లమంతా ఒకటీ, నువ్వొకడివీ ఒకటి కాదుగదా ముసలాయ్?

ముస: ఆ మాట నేనన్నానంటయ్యా తిరపతయ్యా? అంటే నానోట పురుగులు పడిపోవాల్సిందే. మీరు మా కీపని ఇప్పియ్యక పోయివుంటే మేమిద్దరం ఏమయి పోయే వాళ్లమో.

తిరపతి: అట్లాగే మేమూ మీమాదిరి కడుపు కక్కుర్తితో బతికే వాళ్లమే. ఇవాళ మమ్మల్ని పనిలోంచి తీసేస్తే మీరొచ్చిన దారినే పడి మేమూ వెళ్లిపోతాం.

ముస: అంతమాట అనగూడదులే తిరపతయ్యా. ఎంతసెడ్డా మీరు పనివాళ్లు. మా ఏనాదోళ్ల సంగతే వేరు. ఎందుకూ పనికిరానోళ్లం! మాబతుకే బజారు బతుకు. ఈ మిల్లులో మాకు ఎట్టా కడుపుకు ఇంతదొరుకుతుండదా అని మాలో మాకే అచ్చెర్రాంగా వుంటది.

తిరపతి: మా బతుకూ మీ కంటే తేడాగా లేదనీ, మేమూ మనసులో కుళ్ళుతుంటామనీ చెబుతే నమ్ముతావా ముసలాయ్. ఆ బాయిలర్ దగ్గరుండే చలాన్ని ఎరుగుదువా!

ముస: ఎవరూ? ఈ మధ్నె కాలుజారి పడిన మడిసేనా?

తిరపతి: అవును, అతనే. ఆ బాయిలర్ చుట్టూవున్న చక్కతుప్పు నూనె కార్తుంటుంది తెలుసా? చలం కాలుజారి ఆ పక్క రైలింగులోంచి కిందపడ్డాడు. మొన్న ఆస్పత్రిలో విరిగిన ఆ కుడికాలు తీసేశారు. నిన్న మూణ్ణెల్ల జీతం ఇచ్చి మిల్లులోంచి తీసేశారు చలాన్ని. ఆ బాయిలర్ దగ్గిర సరైన కట్టుదిట్టాలువుంటే, చలానికి ఈ విధంగా అన్యాయం జరిగేదికాదు. ఈ అన్యాయం వల్లనే పని వాళ్ళంతా స్ట్రయికు చేస్తున్నారు.

ముస: అదుగో పోలీసులొచ్చారు! కొంపమునిగింది!

తిరపతి: ఎందుకూ కొంపమునగటం? పనివాళ్ళంతా కలసి కొందరు పెద్దల్ని కలెక్టరుగారి దగ్గరకు పంపించారుగా?

సింహా : అదుగో గేటు దగ్గర ఏదో గొడవ జరుగుతున్నది! రారా తిరపతీ పోయిచూద్దాం.

ముస : నామాటినండి. మీరెల్లద్దు.

తిరపతి : నువ్వు ఇక్కడే వుండు మేం వెళ్ళొస్తాం – అదేంటీ కిల్లీ కొట్టు రంగయ్య ఇటుగా పరుగెత్తు కొస్తున్నాడూ? ఏంది రంగయ్యా? ఎందుకు హడావిడిగా పరుగెతుకొస్తున్నావు?

రంగయ్య : ఇదిగో ముసలాయ్? నీ పెళ్ళాం ఏదీ!

ముస : ఆఁ? ఏదీ? మిల్లులో వుందిగావాల్ను!

రంగయ్య : బలేపనిచేశావు! మిల్లులోంచి ఓ పిల్లోడు పరుగెత్తుకుంటావచ్చి నీకోసం అడిగాడు. ఈ జాతరంతా చూసి నీ పెళ్ళాం నీకోసం ఆదరా బాదరా వెతుకుతూ పోలీసులు రావటంచూసి లోపల ఆ గోడవును దగ్గిర పిల్లాణ్ణి కన్నదంట! అబ్బ! – నీకు తెలవదా?

తిరపతి : పరుగెత్తరా ముసలాయ్. – రారా సింహాచలం.

సింహా : పదండి జనాన్ని తోసుకుని.

రంగయ్య : ఎక్కడికీ పొయ్యేది – వుండండి. గేటు మూసేసి పోలీసులు కాపలా కాస్తున్నారు.



# కిష్టమ్మగారి పెద్దజీతగాడు

ఈ ఏటి పంటకుప్పలు దొంబు దొంబున నూర్చెయ్యాలి. అదే కిష్టమ్మగారన్నారు. మడిసి అన్నాడంటే నూర్చెయ్యాల్సిందే! లేకపోతే ఒసికర్రదీసుకు తల పగల్నాకుతాడు - అట్టాటి మడిసే కిష్టమ్మగారు. సెయి బహు సురుకు యీ కిష్టమ్మగార్ది. మడిసికి ఏ నిమిసాన గుబులుమల్లుద్దో, ఎప్పుడు యీపు మీాన సెయిపడుద్దో తెలవదుగందా! కాత్తే పెద్దజీతగాణ్ణిగందా- అప్పుడప్పుడు మడిసిని నమ్మగూడదా అనిపిచ్చుద్ది. పెళ్లి జేసుకున్నా - పెళ్లాం కాపరాని కొచ్చిందీ - అయినా మడిసిని కనిపెట్టి చూస్తాం యీ కిష్టమ్మ దొంగ్గోలా! అల్లప్పుడు పుటిక్కిన నోరు జారన్నా సుబ్బాంతో "కష్టమ్మగారు పోలుపు దీసుకుని బాదా"డని. ఇరగబడి నవ్వింది. నడ్డి యిరగదన్నాల్సిందప్పుడే. ఉత్త కొక్కిరాయిముండ? అయినా కొత్తగా పెళ్లి జేసుకున్నోణ్ణి పెళ్లాంతో యిట్టాటియ్యన్నీ- అసలెవరన్నా సెప్పుకుంటారా అంట? అసలు వుత్త ఎదవనుగాన్నూ నేనూ? ఇట్టా వొచ్చుద్దనే ఆ మద్దె తోలేకాసినాను, కిష్టమ్మకు గుబుల్దిరిగి, ఒసికర్ర దీసుకుని తల పగల్నాకుతే, కిక్కుమనకుండా ఎల్లి వాములదొడ్లో పండుకున్నా. పోనీ పని మానుకుందామా అంటే మాటలా? ఆనాడు గురవాయోళ్లు యేమన్నారూ? "నీకు ఏనాడో సుడివుండది లేరా, కిష్టమ్మ

గారి పెద్దజీతగాడి వయినావృా !” అన్నారు, ఆళ్ళకేం దెలుస్నద్ది అస్సల్సంగతి ? అయినా యింకోసోట యాడన్నా కాత్తె సమా రయిన పని దొరకాలగందా ? ఏడా ? యీ సన్నాసున్నానేనా మడుసులు కాత్తె సుమారుగా బతికేదీ ? ఎదవమొగాలుగాదూ యీడంతా ! అంతాదివాలా ఎత్తారుగందా, కేసులు బోసుక్లో తలకాయలు పగల్నాక్కానీ ! అందుకే డీన్ని బొంబోడూ రంటారు. ఎవరో ఒకరిద్దరు కిష్టమ్మగారంటి వారయితే అట్ట ట ట ట మద్దెన బాగుపడ్డారు గాని- మిగతాదంతా వృత్తిశత్త గాదూ ? పొలం అంటే కిష్టమ్మగారి పొలం అనాల ఎప్పటి కయినా! రతనాలు కక్కుతయ్యంటే ఇంకా ఆడ సచ్చేంవుంటద్? ఈ సేతుల్తో యిన్నేళ్ళమించి ఎట్టాటి కుప్పాలూన్నార్చానూ? హుం, కోటయకొండ పెబలాంటి కుప్పుంగ ! “ఒలియ ఒలివో” అంటూ తొలికోడి -కూసినప్పట్నుంచీ కొట్టుకుంటూ పోయిన పోటం – జల్లలా జల్లలా రాసుల్రాసులు అంతరిచ్చానికి లేసి పోతా వుండాల్సిందే – కిష్టమ్మగారు అవకాడ నిలబడి ఇదంతా చూస్తా నవ్రుతా వ్రుంటాడు. నాకే గనక అట్టాటి కుప్పలుం టేనా! సుబ్బాన్ని సికరంమీాన కూంకోబెడ్తా! నవ్వుద్ది సుబ్బాం! ఆ గింజనంతా మీానబోసుకుంటూ తరంబరాలకుమల్లే! కుప్ప గొట్టే ఎంకాయ్, యీరాయ్, పోలాయ్, పెంటాయ్, దిబ్బాయ్, గుంటాయ్, మట్టాయ్, చక్కాయ్, పుల్లాం, పోలాం, ఎర్రాం, ఎంకాం యీాళ్ళందరికీ బత్తాలకి బత్తాలు—”

“సూరాయ్” అన్నది కిష్టమ్మగొంతు.

“ఏంది కిష్టమ్మగారూ–” దున్నకుర్రకు గాబుకాడ నీలు పెడ్తా సుట్ట మైకంలో కూకునుండ పెద్ద జీతగాడు – కండబల్సిన

కోడెదూడ కుమ్మిన కుమ్మాటాం అట్ట ట ట ట ట లెగిసి పోయి నట్టు – పట్టివేసి నిలబడ్డాడు సూరాయ్, కిష్టమ్మనీడ అట్టగుపించే తలికి.

"సుట్ట గీటుమీానుండ దేరా సూరాయ్?"

"అబ్బె యాడ్డండీ – వుత్త శత్త పుగాకయితే!"

"చా యదవా పొల్లు రాన్నాకే వొళ్లు లేకా! దున్న కర్రకు అంతసేపంట్రా నీలుతా పేదీ!"

"సప్పరిచ్చుకంటా తాగుద్దండీ-"

"ఇగ ఆడకి సాల్లేవోయ్ ముండా"

"అంతే లెండి."

"ఇదుగో సూరాయ్?"

"ఏంది కిష్టమ్మగారూ?"

"ఈ ఏడు మనపంట ఎట్టాపండిందనుకుంటున్నావురా?"

"ఇరగబడి పండిందంటున్నారండీ?"

"నిజంగా నంట్రా!"

"నిజంగా! వూరంతా యిదేమాటయితే!"

"బలేపంట పండిందటావ్?"

"బలేగిలే ఎరగమే!"

"సూరాయ్?"

"ఏంది కిష్టమ్మగారూ?"

"కొత్తకోడెగిత్తి లొస్తున్నయి తెలుసునంట్రా!"

"యాడ? – ఎవురికీ–!"

"మనకేరా యెదవా!"

"ఏందీ-నిజంగానంటండీ- చా-! అరె-అఁ హిం-హిఁ-హిం
సెప్పలేదేంటండి కిష్టమ్మగాఁరూ?"

" మొన్న ఏటవతలకు ఎల్లినప్పుడు బేరం జేసొచ్చాలే.
యీ పాటికి రెడ్డెమ్మ తోలుకొస్తావుండాలి."

"చా!"

"చా ఏందిరా ముండా. బల్ మనగాడి గిత్తలయితే!"

"ఆఁ-యిహిం - ."

"ఈఏడు కుప్పల్నూర్పిడంతా మన కొత్తగిత్తల
మీనగా పోవాల్సిందే!"

"దుమ్ము లేపనఁడీ!"

"పదిహేఁనొంద లిచ్చికొన్నా?"

కిష్టమ్మగారు తల్చుకుంటే పదే నొందొక లెక్కేం
దంటా!"

"మంచి ఏపుమీనుండయిలే!"

"యింకా ఏపుమీన మేపుతా!"

"సూరాయ్?"

"ఏంది కిష్టమ్మగారూ?"

" రేపు తొలికోడి కూసే యాలకు నూర్పిడి మొదలు
పెట్టాల - చెప్పానుగా?"

"మరి అంతేగదండీ."

"మాలపల్లిలో అందర్నీ కేకేశావంట్రా?"

"ఎప్పుడో అయిపోతే."

"గొబ్బిరికాయలు తెచ్చావంట్రా?"

"అప్పుడే తెత్తిని గదంటండీ."

"రాత్రికి యింకోసారి ఎల్లి వాళ్ళందర్నీ రెడీ గుండమను."

"ఎళ్ళను మరి!"

"నువ్వు పొదలకాడ తెగవకపోయినావంటే మొసిరగ నూకుతా – తెల్సిందా?"

"మొదలు నాకు నిదరేడ పట్టుద్దండీ!"

"కోడిగిత్త లొస్తావుంటయి. గాబులో కుడితి గలిపి రెడీగుండు – ఆఁ?"

"క్లై! కోడిగిత్తలు తల్సుకుండమొయ!" అనుకున్నాడు సూరాయ్.

"పంటకుప్పలు! కోటయకొండ పెబలకుమల్లే–ఎంకాయ్ యీరాయ్, పెంటాయ్, పోలాయ్, మట్టాయ్, చక్కాయ్, దిబ్బాయ్, పుల్లాం, పోలాం, ఎంకాం, ఎర్రాం – తెగిసిపోవల్సిందే – నూర్పిడి తల్సుకుండమొయ..."



నిశిరేత్రే తెగిసి కూకుండాడు తను. నయం! యింకాన తను పండుకునేసి! పంటకుప్పలు నూచ్చుకోనక్కర్లా? తో కోడి ఎప్పుడుకూసినా కూసుద్ది.....

పంట యిరగపడి పండింది! పంటకుప్పల్ని సూత్తుం ఒల్లు యాడికో తెగిసిపోతుండది! ముంగలగా ఎల్లి తను ఒకో పంటకుప్ప సికరమ్మీన కూకోవాలి – సుబ్బాం అంత దొబ్బు ఎక్కలేదు – ఆఁ, దాన్ని నమ్మిందెవరు – తల్సుకుంటే ఎం పనయినా సేసుద్ది, పిర్రతెగ రేసుకుంటూ. బల్ ముద్దొచ్చు ఎదవముండ! నూర్పిడి అవుతావుంటే చూడాలి ఎదవను

యియ్యాల ఒక్దగింజనంతా దాన్నె త్తినే పోశానుకో- యిద్దరం పోసుకుంటాం.

అరె నాయనా ఎట్టాటి కోడెగిత్తలు! సూరాయ్ కోడె గిత్తెలు! గిత్తలమీన కిష్టమ్మ సెయివేశాదంటే ఒసిక్రతో తల ఏటుకు పగిలిందన్నమాటే! ఇంకా నెమరేత్తా పండుకున్నా రేందే, లెగవండి లెగవండి ఏలయిపోతుండది - దూరపయానం జేశారుగావాల్ను కూసేపు జనపకట్టల్ని తినండి - యియ్యాళ్ని తినండి. ఎందుకే అట్టజూత్తారూ? సూరాయంటే వాడు వీడనుకుండాకో ఏమో, మీమీన యీగవాలిందంటే యీ సూరాయి పానం ఆవజాన అడ్డంగా పడిపోవల్సిందేననుకోండి- గెనగెన గంటలు, గజ్జెలు, మువ్వలు, కుచ్చులు, గులాం కొట్టకుంటా - దుమ్ములెగుపుతాపోవాలి యాడకె పోయినా- తెల్లమొండెము సూరాయిగిత్తలు - యీ సుబ్బా యింకా పండుకుందేం యాల మిగిలిపోతుంటే -

"సుబ్బాం?"

"సాన్లే పూకో—"

"లెగవ్వే నా-సిలకా-"

"అదేందమ్మా కోక గుంజుతాడూ-నా చంగ తెంగవు- నిదరొస్తుండది-"

"నిదరా? యిదేం సుబ్బారా యిదీ- గెంటలు గెనగెన మోగిపోతావుంటే, లెకులెగూ-"

"అబ్బబ్బబ్బబ్బ యిదేం మొగుడ్రో నాయినా - నా సెవులో మోగియ్యమాక - బుడ్డపుంజుకుమల్లే - అబ్బోబ్ - ఎహాలెగూ నిశిరేత్రి యిదేందంటా-మాయదారి సచ్చినోడా-"

"అరహరా! ఒలియ ఒలియో - ఇదిగో సుబ్బమ్మోవ్, ఎర్రకోక, నల్ల రెయిక కట్టుకు రావాల్సిందే ఝుమ్మ్యాల - ఓరి ఎంకాయ్, యీరాయ్, పోలాయ్, పెంటాయ్, మట్టాయ్, చక్కాయ్, దిబ్బాయ్, గుంటాయ్ - వాసి పుల్లాం, పోలాం, ఎర్రాం, ఎంకాం యీడవుండార్రా మీ మనసులు బంగారం గానూ - తెగవండ్రా, తెగవండ్రా తెల్లారిపోతుండదీ - సుబ్బాం గొబ్బిరికాయ తెస్తుకురా - ఎర్రకోక, ఎర్రకోక - పదండి పదండి, తెగవండి తెగవండి - సూరాయ్ కోడెగిత్తెలు - ఎల్లిపోతుండయి మేగాల్సిన——

"ఎందుకే సుబ్బాం సిగ్గువస్తుండావ ?"

"బలేబండి - బలేగిత్తెలు !"

"సూరాయ్ బండి, సూరాయ్ గిత్తెలు-
'ఒరి ఒరి బండివోడా, ఒగలమారి బండివోడా'- ఓ హొయ్-"

"బండీమీనా నాసోకూ నిలపరా బండివోడా- ఏ హేయ్-"

"ఓహో సిత్రరేఖా ?"

"ఏమి అనిసుద్ధణా ?"

"ఏహో అనిసుద్ధుడనే-"

"ఏం సచ్చాన్లో యదవ - ఒగలమారి బండీవోడా !"

"బండీమీనా నీ సొగసూ - ఓరి రండిరా, రండిరా మూర్తం మించిపోతూండదీ - గొబ్బిరికాయలు కొట్టవేందే సుబ్బాం -"

"క్లె! మడిసంటే సూరాయ్‌కిమల్లే అట్టుండాలి!" అంటుండారు కుప్పగొట్టే ఎంకాయ్, యీరాయోళ్ళు - తనకి చెల్చు ఎంకాయోళ్ళసంగతి - "ఒలియ ఒలియో - ఎత్తరేంది రా కట్టలూ - "

క్లె! రతనాలకి మల్లే రాల్తుండయి గింజలు! సూరాయ్, సుబ్బాం, ఎంకాయ్, యీరాయ్, పోలాయ్, పెంటాయ్, మట్టాయ్, చెక్కాయ్, దిబ్బాయ్, సుంటాయ్, పుల్లాం, పోలాం, ఎర్రాం, ఎంకాం - యీళ్ళందరి సేతుల్లోంచి రాల్తుండయి గింజలు - తళతళ, బగబగ మెరుత్తా రాల్తుండయి - అందరి మొగాలు మెరుత్తుండయి - ఎంకాయోళ్ళ ఒళ్ళు సెమటలు కారి పోతుండయి - ఎర్రాయోళ్ళ కళ్ళు రఖతం గక్కుతుండయి - ఒలియ ఒలియో——

"సుబ్బాం, నీకళ్ళు నీలుగార్తుండయ్యేందే!"

"నీ మొగం ఎర్రగావుండదేరా!"

"దువ్వ లెగిసిపోతుండది - కుప్పలు కరిగిపోతుండయి - తొక్కుండి తొక్కుండి కళ్ళాం, ఎయ్యండి, ఎయ్యండి కళ్లాం - సుబ్బాం, తూర్పార, తూర్పారపట్టు, పట్టు-తరంబరాలు——"

"ఓ హేంయ్!"

"ఏ హేంయ్!"

"ఆర్నాయినా జిలేబి సెంచయ్య ఒచ్చాడ్రా నాయనా - ఓతాళాసెవుల గుత్తి సెంచయ్యోవ్ - జిలేబి, సెక్కరాలు, పకోడీలు, పొప్పుండలు, ముంతకజ్జాయం - ఓర్నీ రానయ్యా

సీయిల్లు బంగారంగానూ. వారె గోతాం దెచ్చాడ్రా యీ సెంచయ్య కడుపాత్రంపాడుగానూ - ముంగల కాత్తె జిలేబీ పెట్టు. ఆసకసూద్దాం గోతాం సంగతి - ఏఁదడీ-ఏంది సన్నాయి కర్ర యినిపిచ్చెద్దేం - గంగిరెడ్డోళ్ళు ఒచ్చార్రా నాయనా - పెల్లి జేత్తాఁరుగా వాల్లు - ఎహె పదండాతలికి సెవులో వూత్తారూ-ఎహె ఎహె, యిదేంది గంగిరెద్దు వస్త్రకుప్పెక్కద్దీ- ఓ గంగిరెద్దాయనోవ్, కాత్తె దాన్ని నిలపవయ్యా సికరమ్మీన కెల్లి కూకుంటదేమో - వుండండి, కాత్తె వుండండి-వూదమాకు అదుగో ఆడ నిలబడి ఆడండి గంగిరెద్దాట - ఇదుగో సీతారాములోరి పెల్లి-పెల్లి ఆడిచ్చాల తెల్పిందా !"

ఏనాది సెంచాం కూతురు బుడ్డని ఒడిగట్టుకొచ్చి మొగమాటంగా నిలబడ్డది - సుబ్బాం సేటుగో శాలెడు గింజలు బుడ్డదా నోట్లో పోసింది-

"సుబ్బాం"అనాన్నడు తను ఎర్రకోక సుబ్బాన్ని వస్త్రాని సికరం మీసకు లాగుతా.

"ఏఁదయ్యా !-" అంటున్నది సుబ్బాం సిగ్గుతో తలొంచకుంటా.

ఎర్రగా నల్లగా మెరిసిపోతుండది సుబ్బాం - పెద్దకాలు గట్టిన సూరుడు ఎర్రబడిపోతుండాడు రఖితాసికిమల్లే - రం నాలకిమల్లే - అదేంది ! - ఎంకాయ్-యూరాయ్ - పోలాయ్ పెటాయ్ - మట్టాయ్, చక్కాయ్, దిబ్బాయ్, గుంటాయ్ పుల్లాం, పోలాం, ఎర్రాం, ఎంకాం రాసి సుట్టూతాజే ఎగుర్తుండారు - ఓహోయ్ -

"ఓరి సూరాయోవ్ –"

మంచంమీన్నుంచి ఎగ్గిరి కిందపడ్డాడు పెద్దజీతగాడు సూరాయ్... అది కిష్టమ్మ గొంతు.

"యీయాల కుప్పలు కొట్టకల్లేదంట్రా సూరాయ్? యింకా లెగశావా లేదురా – తన్నండ్రా సిదర మొగం నాయాల్నీ– ఎల్లి ఎంకాయ్, యీరాయోళ్లను కేకేసిరావేం." దబదబ దబదబ కిష్టమ్మ గొంతూ, సెయ్యా సూరాయ్ గుడిసె మీన, గుండెమీన మోగిపోయిన్నై దద్దరిల్లగా...



# పిప్పిదంట్లు

'ఒంటిపూట కూడు తింటావున్నా సీతాం నేను యింత మాటకు ఎటనోగట్టి పోతావుండాగందా, తనకు యిరోశనాలు బట్టుకుని రోజురోజుకు మనిషి ఆవజాన దిగజారిపోతావుండది, నే నేంజేసి చచ్చేటట్టు? కూలివోరకా, కూలిదొరుకుతే గింజదొరకా యీవజాన అడకత్తెర్లోబడి కొట్టుకుంటుండ నాలాటోడికి బగమంతుడుమటుకు కేం జేస్తాడు?"

"తిండికి కరువొచ్చిందని రేసను పెట్టారు. నిజమే– పెట్టాల్సిందే నన్నడిగితే– మరి పెట్టినాక ఆ కూసిన్నోనయినా– నాయం జరగాల్సిందేగా? సేతిలో దమ్మిడుంటే దమ్మిళ్ళేక కిందటివారం రేసను తియ్యాకపోతే యీవారం అయి ఆవజాన నీలుగారిపోవల్సిందేనా? నాయం సూడమన్నా. పోనీ రూల్చుండయ్యంటే రూల్చుండయ్యనుకుదాం. రేసను ఎంకయ్య ఏమన్నాడూ? "మీ కేంరా నలుగురిచేలో కూలిచేస్తేసరి, గాదెనిండా పోసుకుని ఏడాదిపొడుగూతా కాలుమీద కాలేసుకుని తినొచ్చూ! మీకు కరువొచ్చిందంటే రాజాధి రాజులకు గూడా వొచ్చిందన్నమాటే!" అన్నాడు. ఆ మాట నన్నేన అనాల్సిందీ? వూళ్లో వుండ నలుగురు పెద్దమనుషుల్ని పిలుసుకొచ్చి యిల్లంతా తనికీచేయించిగందా ఆమాటనాల్సిందీ? ఆ పెద్దమనషులికి మటుకు తెలవదూ మనూళ్లో ఎవరింటో ఎంతెంత వుండదీ

నా పెళ్ళానికి తిండి తక్కువయి ఏడిజేసి యిరోశనాలుపట్టు కుంది సానామందికి తెల్చే? రంగయ్య రూపాయికి తవ్వెణ్ణ రోసేలుడు బియ్యం కాడికి పబిలిగ్గా గల్లా కొడ్తుండాడే, యీ ఎంకయ్య ఆళ్ళసంగతి ఎత్తడేం? ఎంకయ్యా? అబ్బో యీన మంత్రిపని జెయ్యాల్సినోడు గాదూ? ఆ మద్దె యిట్టాగే ఓ సోమారంనాడు సేతిలో డబ్బుసాలక అద్దరూపాయి బియ్యమే కొలిపించుకెళ్ళి, యిట్ట మూడోనాజు నొద్దునూ, యిగనేం వుంటయ్యాషా? ఓరి నీ యిల్లు బంగారంగాను యిదేందియ్యా అనడుగుతే "యిదొకటా పైగా! అప్పుడే తీసుకెళ్ళివిగా అన్నీ? కావాలంటే ఎవరికన్నా కాద్దుచూపించుకో వాళ్ళే చెప్తతారు గీత ఎక్కడిదాకా వుందో! చస్తున్నాం యీ చమ్మరాని ముశాళో!" అన్నాడే ఎంకయ్యా! ఆ గీతే దో, అడెక్కడ కొచ్చి నిలుసుద్దో నా కెట్ట తెలుసుద్ది! మనిషి మాట నావజాన ఎత్తాతలపారేస్తే అటిటు సూడకుండా నెత్తిన గుడ్డేసుకుని యింటికిపోలా నేనూ? అసలు యీ రేసనాయన్తో పేసీపడేగతేం బట్టిందంటూ. బసవయ్యగారు నాయంగల మనిషయితే, కూలీకి ముంగల దాన్యం కొలుత్తానని వొప్పందం జేసుకునీ, తీరా నాట్లయినాక మా ముగ్గుర్నీ కలిపి దగ్గిర దగ్గిర రెండుబత్తాల దాన్యం గింజలు ఎగ్గొట్టి డబ్బు సేతిలో పెట్టెనుగా? రేసను కొట్టో బియ్యం సాలకా, రంగయ్యకాడికెళ్తే ఆ వుండది నీలు గారిపోయీ – సివరికి ఏం దక్కనట్టయిందీ? ఆ దాన్యంగింజలే వుంటే ఆడది ఆవజాన మంచానపడేదా, ఇన్ని పేసీలుండేయా?" అనుకుంటూ రేషనుషాపుదగ్గర కొచ్చి తలెత్తి చూశాడు పాపయ్య.

'అబ్బో ఏందీ జనం! కాస్తండ పెళ్ళో గూ యివాళే వొచ్చారేందబ్బా! ఏందో అరుసుకుంటున్నారే - తెలవదేం - ఏందబ్బా....' జనాన్ని తోసుకుంటూ షాపుముందర కెళ్ళి నుంచున్నాడు పాపయ్య.

షాపు తాళంవేసి తాళం చేత్తో వెంకయ్య అక్కడ నుంచుని వున్నాడు.

"యిప్పటికి పదకొండుసార్లు చెప్పాను, మళ్ళీ పన్నెండో సారి చెప్తున్నా, బియ్యం రాలేదు" అన్నాడు వెంకయ్య.

"ఎప్పుడొస్తాయ్" అన్నారు జనం.

"ఎప్పుడొచ్చేదీ నేనేం కలగన్నానా?" అన్నాడు వెంకయ్య.

"మరి మే మేంగావాలి?" అన్నారు జనం.

చేతులెత్తి జనానికి దండంపెట్టాడు వెంకయ్య.

గుటకమింగుతున్న పాపయ్యను జనం అటూఇటూ తోశారు

*　　　*　　　*

పన్నెండు గంటల రాత్రయిందేమో ననుకున్నాడు పాపయ్య. 'యిగ తనకు నిద్రపట్టదు. పట్టటం సాలాఅనుమానం. పత్తే బాగుండు. కడుపులో ఏంలేంది నిదరపట్టేదీ లేందీ తనకు బాగా గాపకంరావటంలా. మరి తన పెళ్ళామూ, కూతురూ సిదరపోతుండారే స్థిరంగావుంది? యివాల్టికి నాలుగు రోజులు కాలా రేసనుసాపు మూసీ? అయింది...అటుమొన్నే మో, ఆవుండ కాసిని అటుకులు తిన్నాం. మొన్నా, నిన్న పెసర గుగ్గిళ్లా-దూపాయికి తవ్వెడ్డాబ్బో నెడు పెసలా!...అటు మొన్న

శేషయ్యగారి కూలి రూపాయిపావలాబెట్టి తవ్వెడు సోల్జొన్నర గిద్దెడు పెసలుదెచ్చి, మొన్న సోలెడూ, నిన్న సోలెడూ పోతే యింకా ఎన్ని వుండయి? సోల్జొన్నరగిద్ద డుండయి. అయి రెణ్ణాళ్ళు వుండం ఎందుకయినా మంచిదిలే. ఇవాళ గజ్జేరాకు పులుసుతాగితే కడుపంతా తొలిసినట్టయింది ఎందుకనబ్బా? కాత్తె గట్టిగా ఏమన్నా పడకబోతే అట్టయిందా? ఏమయితే మటుకు రూపాయికి తవ్వెణ్ణొస్సెలెడు పెసల్లెక్కన ఎన్నాళ్ళు దింటాం? ఇనాళ్ళా రంగయ్య రూపాయికి తవ్వెణ్ణొరబియ్యమన్నా యిచ్చేవోడు. ఇప్పుడు మనిషి ఎందుకనో మాట్టాట్టంలేదే? దాన్యం అయిపోయినయ్యో ఏమో? లేకుంటే వున్నట్టుండి ఏ తవ్వెడో, మూడస్సెళ్ళకాడికో బరాటు తీస్తాడెట్టా? ఆయనకేం మారాజు, అనుబవం వుండబిగనక ఏం జేసినా జేత్తాడు. కాదుగూడదంటే తింటానన్నా కూకుంటాడు గాని మాకుమల్లె యీవజాన కడుపులు కాల్చుకోడుగా! అసలు సుడిగల మనుషులే వేరు.

"ఆవజాన అయిపోతుండది తన పెళ్ళాం, బొమికలు మిగిల్నయి. జావపోయమంటాడు బెమ్మానందం. రెండుపూటలా వరన్నం తింటున్నంతకాలం గెడకర్రలాగావుండే మనిషికి జావ పోస్తే నయంగుంటదా యిది కూడుచాలక వొచ్చిన జబ్బయితే? అసలు ఏ మాత్రం ఒంటో సుమాయిగావున్నా వొచ్చి మీద వాలేదిగాదూ! ఎనక ఓ పూట తిన్నా, తినకపోయినా యింతన్యాయం ఎప్పుడన్నా వుందా? ఎంత ముదనష్టబ్బతుకయింది మాదీ!... రేసనుకొట్టోక బియ్యం ఎప్పుడొస్తయ్యో?... ఎందుకో అనిపిచ్చద్ది తన పెళ్ళాం దక్క

దేమోనని - చా, ఎదవను గాకపోతే యిట్టనుకుంటానంట! రేపు నాకూ యిరోశనాలు పట్టుకుంటేనో? అసలు వాసన జూస్తే రోజులు ఆట్టాగే వుండయిలే! పోనీ సత్తే అందరం జస్తాం - యింతకన్న సచ్చేదేంది! తెల్లారి లెగుస్తే కూడో కూడో అంటా దేవులాటయిపోయింది. ఎహె ముదనష్టబ్బతుకయినాక యిగ దేనికీ!"

"గజ్జేరాకు పులుసు పాయసంగా తాగాల సొచ్చిందే? పెసర గుగ్గిళ్ళు సానానయం! సీతాంగూడా అట్టనే అంది. పిచ్చిముండ అదే కాస్త నయం. ఇట్టాటి సిక్కులు ఎన్నొచ్చినా - మొదులు పిల్ల నోరెత్తుతేగందా అనుకోవల్చింది. పోనీలే గుడ్డిలో మెల్ల ... యింకా సోలెణ్ణర గిద్దేడుండయి! ఎటనయినా పెసర గుగ్గిళ్ళు బాగానే వుంటయి. చనగలుగాని, కందులుగాని - యింకేవీ వుండవు యీటంత రుపెగా! రూపాయికి తవ్వెణ్ణరొస్తలేదు...సానా కష్టం..."

ఏంటో చప్పుడయిందనుకున్నాడు పాపయ్య. చీకట్లో ఏం కనుపించటంలేదు. ఎలికయివుంటుంది. 'అదేం పీక్కు తిందామనొచ్చిందో' అనుకున్నాడు పాపయ్య.

"యివాళ తనకు నిద్రరాదు. ఎవరన్నా నాలుగు వొడ్ల బస్తాలు తన యీపుమీన పడేస్తే బాగుండు - ఏంటో."

ఏంటో బఱ్ఱెగొడ్డు జనపకట్టె తింటున్నట్టు పరుక్కు.... పరుక్కు మంటున్నది. సీతాం నిద్దర్లో కలవరిస్తున్నదనుకున్నాడు పాపయ్య. పిచ్చిముండ నిద్దర్లో ఏంటో నముల్తుండది....పరుక్.... పరుక్....పర్రుక్ - పాపయ్య గభాల్న లేచి సీతాం పక్క

తవిడాడు. పక్క ఖాళీగా వుంది - ఒక్క వూ్ప్రులో గుడిశ బయటకొచ్చి పడ్డాడు పాపయ్య.

ఆ నక్షత్రాల కాంతిలో సీతాం మట్టి అరుగుమీద కూచుని - ఆ చప్పుడు చెయ్యడం స్పష్టంగా చూశాడు పాపాయ్య.

"ఏందే నువు జేసేదీ?" అన్నాడు పాపయ్య.

"వూరకనే—" అన్నది సీతాం గొంతులో గుడ్డ దూరినట్టయి.

"మాట సరిగా రానీ?" అన్నాడు గలబరించినట్టు.

"పెప్—" అంది సీతాం.

పెటీమంది సీతాం వీపుమీద - మెరుపు మెరిసి ఢాం మ్మన్నట్టు. నేలకరుచుకున్న సీతామును గూడుపట్టుకు యీడ్చుకుంటూ గుడిశెలో కొచ్చి దీపబ్బడ్డి ముట్టించాడు పాపయ్య.

"అయ్యో - ఏందిదంతా—"అన్నది మంచంలోవున్న పాపయ్య పెళ్ళాం సుబ్బమ్మ, ఆత్రంతో వొణుకుతూ.

"మాట్టాడవేందే?" పాపయ్య కాలు లేచింది.

"అయ్యో కొట్టమాకయ్యా సచ్చానూ -" అనరచింది సీతాం బాధతో ముడుచుకుపడిపోతూ.

బుసలిడుస్తున్న పాపయ్య కాలు అట్లాగే ఆగిపోయింది, గోడదగ్గిర కదలకుండా చుట్టగా పడివున్న సీతాన్ని చూసి.

"బాబో—" అన్నది సుబ్బమ్మ జుట్టు పీక్కుంటూ.

బిత్తరపోయి నుంచున్నాడు పాపయ్య గుడిశ కూలి నెత్తిన పడ్డట్టు.

"ఓ దేవుడా –" అన్నది సుబ్బమ్మ హీనస్వరం.

ఆ నిముషాన ఎవరన్నా తననెత్తిన పలుగు దిగేస్తే బాగుండు ననుకున్నాడు పాపయ్య.

మెల్లిగా – వాళ్ళోనుంచి కింద పడిపోయిన పెసల్ని పోగుచెయ్యటం మొదలుపెట్టింది సీతాం.

ఒక్కసారి వొళ్ళు వొణికినట్టయింది పక్కదగ్గిర స్తంభానికి జారగిల పడ్తున్న పాపయ్యకు.

"నిలువున పోవాల్సింది పిల్లపానం!" అన్నది సుబ్బమ్మ శ్వాస తిప్పుకుంటూ.

"నాకేంబట్టలా అంతకర్మ!" అన్నాడు పాపయ్య గుమ్మంలోంచి చీకట్లోకి చూస్తూ.

"నిసిరేత్రి నీకేంబుట్టిందే నీ పిల్ల సావా! దొంగగెడ్డి తింటే పానం సిలసుద్దంటే, నాయంగా తింటే తినాలగానీ?" అన్నది సుబ్బమ్మ.

"ఆసలాడ వుండదే సోలెణ్ణర గిద్దెడు! తిక్కరేగిందంటే రేగదూ?" అన్నాడు పాపయ్య.

ఎత్తిన పెసల్ని మిగతావాటితో మూకుట్లోపోసి, కిక్కురుమనకుండా పడుకుంది సీతాం.

"రేపో ఎల్లుండో ఆ సోలెణ్ణర గిద్దెడూ అయిపోయినాక ఏమవుద్ది? దినమే గండంగా వుంటే ఒకప్పుడుమాటుకు సావు తప్పుద్దా!" అన్నది సుబ్బమ్మ.

"అయితే యివాళే సావమనా నువనేది?"

"సచ్చినోళ్ళెవ్వరూ చెప్పిసావలా!"

"అసలు మనం ఎందుకు సావాలంటా ?"

"నే బతుకుతానని నీకేమన్నా ఆసుండదా ?"

అట్టనమో కే నీకు ప్రశ్నేముంటుంది! అసలు యిరోశ నాల్తో పేగు దిగజారి ఆకలి తెలవక నీ కట్టుండదిగాని కడుపు మంటతో పానం ఎట్టుడికిపోతుండదీ నీకేం తెల్చద్దిలేవే! యిట్ట చావటం ఎవరిపానం వొప్పద్దిలేవే!"

"అందుకేనంటయ్యా ఏన్నముండను అంతలావు తన్ను దంతెవీ ?"

"తనొక్క తేనా యీడుండదీ ?"

"ఎంతకాడికి దిగజారిపొయ్యావ్! యింతకు ముంగల నీ నోటెంట యిట్టాటి మాటలురాలా!"

"నేనా? అదిగందుకే అంది పేగు దిగజారింది నీకని."

"నాకూ దిగజారింది వూళ్ళోవుండ నాబోటి ఆడ గూతుర్లకూ దిగజారిరింది మొగాళ్ళే ముండమోసికూకుంటే!"

"ఏందో కొత్తపదాలు రానిత్తుండావే ?"

"అంతగాక మరేంది? ఒకపక్క బియ్యం లేక రేసను మూసేశామంటుండిరీ యిటుపక్క రంగయ్య గంగయ్యాలు రూపాయికి తవ్వెడు బియ్యం పబిలీగ్గా అమ్ముకుంటుండిరి! ఎవురా మొగోడు వూళ్ళోవుండ పెద్దమనుషుల్ని నిలేసి అడిగిందీ? నువేందో సావకుండా కూకుంటానంటుంటివే - సచ్చినాళ్ళంతా యిట్టా అంటానే సచ్చారు!"

"అయితే ఏందే నువనేదీ ?"

"అనేదేంవుందీ. బతకాలనుకునేవాళ్ళు యింటో గుప్పెడు గింజల్లేకబోతే సూస్తు సూస్తా కూకోర్రు ?"

"ఎవరూ కూకుండదీ ?"

"ఎవురు కూకున్నారో – నాకీ గతిపట్టింది – రేప్రు దానికీ సీకూ పట్టుద్ది !"

"అయితే నువనేని యాడన్నా కన్నం ఎయమనా ?"

"అంత ధైర్నం వుంటే రంగయని బయటికే లాగే వాడివి !"

"కోట్లో ఏపిస్తాడు సీకు తెలవదు గావూల ఆయన సంగతి !"

"ఎవురు రంగయ్యా ?"

"రంగయ్య కాకపోతే రామయ్య. మొన్న ఎవురో అన్నారంటా రామయ్యగారింటో సానా దాన్యబస్తాలుండయ్యనీ – ఆయన్ని కాస్తా పోలీసోళ్ళు పట్టుకుబొయ్యారు – మరి అదెందుకో !"

"మనకెందుకొచ్చింది అరవమాక !"

"మరిగనేంది?"

"ఆయన కూలీకి ఎక్కువగా పోతావుగందా అటనే బసవయ్యగారి కాళ్ళు పట్టుకుందూ ఏమంటాడో ?"

"అది తప్ప యింకేమన్నా మాట్టాడమ టాడు"

"ఎటనయినా తిప్పలు పడయ్యా పానం పోతుండది."

"రోజులు బెఱిసికొట్టినయి. యిగనేం దే చేసేదీ! అప్పుడే యిస్తివి నీ కడియాలు - నల్సుకుపోయిన్నై - యిదిగో - యాడవ మాకే నీకు పున్నెం వుంటుందీ - అయ్యోబగమంతుడా—"

"యింకా దగ్గిర కూకో—"

"కూకుంటాలే - అది గంపకే —"

తెల్లవార్తే బాగుండుననుకున్నాడు పాపయ్య.



# దొంగమొహం

కుంటికాలు దొంగపాపడు వొంటి పక్షి. పాపడి మొగం దొంగ మొగానికిమల్లే వుంటదని సానామంది పాపణ్ణి దొంగపాపడంటారు. దొంగమొగాలకి పెళ్ళిళ్ళు కావు; పెళ్ళే గాంది పిల్లలుపుట్టుకు యాణ్ణుంచి వొస్తారూ? మొదలు పాపడికి నా అనేవోళ్ళుంటమే పెద్ద అనుమానమైన యిసయం. అసలు పాపడు ఏ జనమలోనో బహుపాపం చేసుకునుంటాడు. అందుకే వాడ్డి దొంగమొగం.

కుంటికాలు పాపడి కడుపు కొట్టింది. మరి ఎప్పుడేం పాపకరమం జేసుకుంటే ఏ దేవుడేం ఆ కాలుకాత్తా అట్టా జేసి పొయ్యాడో - మొత్తానిక అదేదో జబ్బులో తన కాలుకాత్తా కాటికి కూటికి కాకుండా పడిపోయిందని సెప్పుకుంటాడు పాపడు.

ఆ వూరి బజాల్లో తింటానికి కాత్తేవన్నా దొరుకుద్దేమోనని కుంటికాలు యీడ్చుకుంటా పద్దాకా మలుపులన్నీ తిరుగుతా వుంటాడు పాపడు. తనది దొంగ మొగమని ఆకీరు సెప్పుకుంటుంటే సానాసార్లు యిన్న పాపడు ఎందుకయినా మంచిదని పై కండవాతో మొగం సానామటుకు సాటుసేసుకుని తిరుగుతా వుంటాడు అటేటు బిత్తరసూపులు సూసుకుంటా.

ఓనాడు సందెసీకట్లో ఎంకటసుబ్బయ్యగోరి యింటి ముంగలగా కాలు యీడ్చుకుంటూ ఎల్తుండాడు పాపడు. అప్పటిదాకా మూసుకునుండ తలుపు పెటీమని తెరిసి తుస్సు బుస్సు మంటూ గుమ్మంలోంచి తల బయటికెట్టి ఒక టేమయిన సీదరించుకుంటుండది ఎంకటసుబ్బయ్యగోరి పెళ్లాం సీతా మాలచ్చుమమ్మగోరు.

ఈపుమీద సరిచి లేపినట్టు సీతామాలచ్చుమమ్మ దూకడుసు ముంగల కాత్తె అదిరిపడ్డా ఎటనే తెప్పరిల్లుకుండ పాపడు 'పోండంటి కాపరానికి ఏం పిక్కులొచ్చిపడ్డయ్యో' అనుకుండాడు మాలచ్చుమమ్మను కాత్తె నిదానంగా సూసి.

"ఎవర్రా పోయ్యేదీ?" అంది మాలచ్చుమమ్మ బరిసె యిసిరేసినట్టు.

"నేనేలే దొర్సానమ్మగోరూ, పాపణ్ణి" అన్నాడు పాపడు కాత్తె అరుగుదెగ్గిరకొస్తా.

"మీద కొస్తావేం, కాస్త దూరాన చావు - అయినా అసలీ మనిషితో ఎట్టా కాపరంచేయటం? రామరామరామ ఓ పెళ్ళాం, పిల్లలూ, కొంపా గోడా-అసలు ఏదీ పట్టించుకోకుండా తుడిచేసుకుపోతుంటె, నా బొంద నేనేం వెలగబెట్టనూ యీ కొంపలో? వుద్యోగం సద్యోగం లేకబోయినా వూహా ఆ వీధులన్నీ ఆ పోడుంముక్కేసుకుని బలాదూరు చుట్టె రామం తేసరి అదే మనకు యిహం, పరం! వూళ్ళోవాళ్ళేంకాపరాలు చేసుకోటంలా? వాళ్ళకూ పెళ్ళాం బిడ్డల్లేరూ? అవ్వా, ఎవళ్ళన్నా వింటే ఇట్టేనవ్విపోతారు! యింటికొచ్చేసరికి, అన్నీ అమరిగ్గా వార్చి సిద్ధంచేస్తే బ్రమనచీని, బ్రేవుమని త్రేణ్చి

శతకాలు వర్ణించుకుంటూ, పవళించేసరికి జన్మలుతరించిపోతుండె! వూఁ, వారుస్తారు సిద్ధంగా! ఒక్కటంటే ఒక్క పదార్థం యింటో మంటబెట్టరు, తింటానికి అన్నీ వర్రగావుండాలి! బొందమీద ఇంత బెల్లంగడ్డ పారేసిపొమ్మని వారంరోజుల్నుంచి కోపైకూస్తున్నా, ఎదీ?" ఆవజాన మంగలంలో పేలాలు ఏసినట్టు పెటపెటలాడిస్తుండది మాలచ్చుమమ్మ.

"పుల్చులో బెల్లం పడకబోతే దాని రుసే పోయె!" అన్నాడు పాపడు బెల్లంమాట యినేతలికి.

"ఎవర్రా నువ్వూ, చుంచుకమల్లే అక్కుర్నుంచున్నావూ, చీకట్లో కనపడకుండా?" అన్నది మాలచ్చుమమ్మ పాపణ్ణి అప్పుడే కప్పుడు సూసినట్టు.

"నేను పాపణ్ణి గదటండి దొర్సానమ్మగోరూ" అన్నాడు పాపడు.

"పాపం బద్దలయినట్టే వుంది - ఒరేయ్ పాపడూ?" అన్నది మాలచ్చుమమ్మ పాపణ్ణి నిలువునా చూస్తూ.

"యీడే వుండా దొర్సానమ్మగోరూ" అన్నాడు, పాపడు మనిషి నిలదొక్కుకుంటా.

"యీయ నేమన్నా కనుపించారుట్రా నీకూ?"

"యీయ నెవ్వరండి దొర్సానమ్మగోరూ" అన్నాడు, పాపడు.

"నా బొందా, నీ బొందా - మా వారు ఎక్కడన్నా కనుపించారుట్రా?"

"అబ్బే, అగుపిస్తే సెప్పనంటండి దొర్సానమ్మగోరూ?" అన్నాడు పాపడు.

"ఎక్కడన్నా పూరేగనీ - యిదిగో పాపడూ, నీకు పుణ్యముంటుంది, కాస్త ఆ వెంకటస్వామి కొట్టుకు వెళ్ళి ఓ సవాసావు బెల్లం మీ అయ్యగారి పేరు చెప్పి తెచ్చిపెట్టావుట్రా!"

"అబ్బే, అదెంత పనండి దొర్సానమ్మగోరూ, యిమానం ఎల్లినట్టు ఎల్లి రానూ."

సీతామాలచ్చుమమ్మ బెల్లంకోసం గుమ్మంలో అటనే కూకుండది.

"ఈ శూద్రసుభన్నాసివాళ్ళనంతా బతిమలాడాల్సిన ఖర్మంపట్టిందంటూ? పులుసులోకి బెల్లం లేకపోతే యీ అడ్డమైన అంటపక్షులూ యిహా కూ - అవ్వ, వెంకటసుబ్బయ్య తండ్రీ -" అంటూ తపసస్తూ మాలచ్చుమమ్మ యింకా సేపిట్లో పాపణ్ణి సూసింది.

"ఏమిరా యిచ్చిచచ్చాడుట్రా బెల్లం- ఏదీ చూద్దాం- అదేమిటి విూద పెట్టాడా యేం ఖర్మ - అక్కడ కిందపెట్టిచావు- యిదేమిటీ, బుఱవేలేదేం! ఎంతదిరా యీ బెల్లం!" అంది సీతామాలచ్చుమమ్మ పాపడు తెచ్చిన బెల్లం చేతికి తగిలీ తగలంగానే అటనే దిగజారిపోతూ.

"ఎంకటసామి యిచ్చింది అటనే తెత్తినిగా!" అన్నాడు పాపడు సేతులు మెలిక లేసుకుంటూ.

"ఎంతని చెప్పి యిచ్చాడ్రా వెంకటస్వామీ" అంది సీతామాలచ్చుమమ్మ వూపిరి బిగబట్టి.

"తప్పఁరు చవాసావు తెమ్మంటిరీ, ఆయన చవాసావు తూసియిచ్చే, యింతలో ఏమయిద్దీ?" అన్నాడు పాపడు.

"అయ్యో, యిక నే నేం జేతునూ - యిది సవాపావు బెల్లంట్రా దొంగపక్షి? అసలు పొట్లం అట్టాకట్టివుంటేనే అనుకున్నా ఖర్మకాలిందని! ఎంత తిన్నాడో ఏమో! కొరికి తిన్నాడా ఏమిటి ఖర్మా? ఎంగిలిమంగలం - అయ్యో నే నేం జేతునూ! పుణ్యానికిపోతే పాపమెదురైనట్టు వీధిలోకి రాంగానే యీ దొంగ మొహంపక్షి ఎదురైనాడు! అయ్యో భగవంతుడా - యిదిగో వారు రానే వచ్చారు సమయానికి - ఏం వొస్తే, ఏం లాభం, అంతా భగ్గునమండిపోయినాక? అసలు యింటోనే వుంటే నా కీఖర్మ ఎందుకు వస్తుందీ, ఏమండీ చూశారా యీ అన్యాయం? పులుసులోకి యింతంటే యింత బెల్లమ్ముక్క లేకబోతే, గీదరిద్రపక్షి యిట్లా వీధిగుమ్మందగ్గిర కనుపిస్తే పోసీగదా అని కొట్టుకువెల్లి మీ పేరు చెప్పి సవాపావు బెల్లం తెచ్చిపెట్టిపొమ్మన్నా - ఆ తెచ్చింం దెంతో మీరే విచారించి యీ కాపరం యీంచుకోండి, నా దార్న నేను నెత్తిన కొంగేసుకుని ఏ కాశో, రామేశ్వరమో వెళ్ళిపోతా-" అన్నది సీతామాలచ్చిమమ్మ ఎంకటసుబ్బయ్యగోరు లోనకి వచ్చిరాకతలికే.

లోన కొచ్చిన ఎంకటసుబ్బయ్యగోరు అటనే కూసేపు కళ్లు మూసుకు నిలబడి - ఎల్లి నడవ తంబానికి చారగిలబడ్డ మాలచ్చిమమ్మనూ, చిత్తరసూపులు సూత్తుండ పాపణ్ణి ఒక్క క్షణం పరికాయించి సూశాడు.

"యినుగో నువు కాశీ రామేశ్వరాలుగనక వెళ్లదల్చుకుంటే మంచి రోజుచూసి అట్లాగే రైలెక్కించి వస్తాగానీ - అయినా ఎప్పుడు చూసినా యీ పులుసులోకి బెల్లాలు లేకపోవట మేమిటి మరీ యిదిగా వుంది నీతో? యిహ ఎన్నాళ్ళు

పోయినా కాపరం యిట్లాగే సాగించదల్చుకున్నావా ఏమిటి? ఎప్పుడు చూసినా ఏ మెరపకాయతోడిమో తక్కువయిందని నడిబజార్లోకొచ్చి గంట మోగించుడిగాని, నువ్వు వంట చెయ్యవా ఏమిటి ఖర్మ?" అన్నాడు వెంకట సుబ్బయ్యగోరు సిరాగ్గా.

"నన్ను సైకెక్కిచ్చి వీధులన్ని తిరిగి, మీరే గంట మోయించిరండి-అవ్వ! ఎవరన్నావింటే ఇక్నో నవ్విపోతారు-ముం దాసవాపావు బెల్లంసంగ తేమిటో విచారించండి. తరవాత లోపలకొచ్చి వాలకపోద్దుగాని" అంది మాలచ్చిమమ్మ తంబాకాణ్ణుంచి.

"ఆ బెల్లం ఎంతరా పాపడూ?" అడిగాడు ఎంకట సుబ్బయ్యగోరు.

"చవాపావు యిచ్చారని యిందాకనే దొర్సానమ్మ గోర్తో సెప్పానండి దొరా-"

"నిజం చెప్పు."

"తూకం ఏపియ్యండి, దొరా."

"పొట్లం సహాం విప్పివుంటే యింకా తూకమేమిటి నా బొందా-" అంది మాలచ్చిమమ్మ తంబంకాణ్ణుంచి.

"అదెందుకయిందో దొరా-" అంటున్నాడు పాపడు-ఎంటనే పాపడి యీపుమీన పెటీ పెటీమ దివరసవరసన ఎంకటసుబ్బయ్యగోరి సెయి.

మరసనాటున్నుంచి వూళ్ళో సానామంది జనానికి పాపడి మొగం అచ్చంగా దొంగమొగానికిమల్లే అగుపించింది.

కొన్నాళ్ళకి అనుకుండాడు పాపడు తన మొగం దొంగమొగా నికిమల్లే వుంటుందని.

*                *                *

ఓనాడు కాలు లాక్కుంటూ వూరు సివర్నుండ లంబాడి కొట్టుదెగ్గిరికి సేర్తుండాడు పాపడు.

"ఒరేయ్, ఒరేయ్ రాములూ, దొంగపాపడు వస్తున్నా డ్రోయ్" అంది సుబ్బులు. రాములుకు కన్ను మలుపుతూ, తన సేతిలో బెల్లపులడ్డు వెనక్కి దాసుకుంటూ.

"పరిపట్టిన ట్టొచ్చాడే పీక్కుంప తెగా!" అన్నాడు రాములు తన లడ్డును రెండు చేతుల్లో కప్పిపెడ్తూ.

కొట్టుమీాన తంబాలసాటున కూసుని, నిక్కినిక్కి సూత్తుండ పిల్లకాయ రాముల్ని, సుబ్బుల్ని సల్లగా ఓసూపు సూసి, వొచ్చి ఆళ్ళకి కాస్తె అసంటగా కూకుండాడు పాపడు మొగమ్మీానకి కండవా లాక్కుంటూ.

సుబ్బులు, రాములుకళ్ళి సూసింది. రాములు ఓరగా పాపణ్ణి సూసీ, సుబ్బులుకు కన్నుమలిపాడు, తన లడ్డు తీసి తింటూ. కాస్తె రాములుకు దెగ్గిరగా జరిగి, పాపణ్ణి సూసీ సూడనట్టు లడ్డుతీసి పంటికొాడికి పోనిచ్చింది సుబ్బులు.

"ఒరేయ్, నీకు డబ్బు లెక్కడివిరా రాములూ." అంది సుబ్బులు మెల్లిగా.

"మా నాన్నకు తెలియకుండా తెచ్చా అణా" అన్నాడు రాములు మెల్లిగా.

"తెలుస్తే చంపత్రా మీా నాన్నా?" అంది సుబ్బులు.

"బలపం కొనుక్కు-న్నానంటా" అన్నాడు రాములు.

"ఒరేయ్, కానీకి ఒక్క బలపంగదా, యింకా ముక్కాణీ ఏంచేశావని మీ నాన్న అడుగుతే?" అంది సుబ్బులు.

"నాలుగు బలపాలు కొనుక్కు-న్నానంటా" అన్నాడు రాములు.

"బలపాలు ఏవంటే?"

"ఇనడుగా."

"అంటే?"

"అంటే, బళ్ళోదస్తరంలో పెట్టుకుంటే ఎవరో ఎత్తుకు పోయినారంటా."

"అంటే వీపు చీరేమంటుంది."

"ఏమందులే. అంటే మా అమ్మ వుందిగా. హుఁ మా అమ్మ లేకబోతే నే అణా తీసుకురాకేం!"

"ఒరేయ్, తెలియకుండా డబ్బులు తీసుకురావటం దొంగ తనం కాదుట్రా?"

"దొంగతనమేగానీ, కోమటి అక్కమ్మ అప్పుడే లడ్లు కస్తుంటే నోరూరిందే సుబ్బులూ – నీక్కూడా తెచ్చిపెట్టాను గామ్మా పాపం?" అన్నాడు రాములు లడ్డు చప్పరిస్తూ.

"అవున్రా రాములూ, బలే రుచిగా వుంది లడ్డు! యీసారి నేనూ అణా తెస్తే నీకూ లడ్డు పెడ్తాగా! ఒరేయ్ చూడ్రా, నా లడ్డు యింకా వేడిగా వుంది" అంది సుబ్బులు రసం చీకుతూ.

"ఏహెహో, నా వొంటికంతా రాస్తున్నావు-దొంగంతా" అన్నాడు రాములు.

"చొంగ కాదురా, పానకంరా!" అంటున్నది, సుబ్బులు నవ్వుతూ.

"ఏం పానకమో మోచేతిదాకా కార్తున్నది–" అంటున్నాడు రాములు.

వడదెబ్బ తిన్నోడికి నీలగాలి తగిల్నట్టు కడుపుకాళ మీాన ముసుగేసుకూకుండ పాపడి ముక్కుకు అదేమయిన బెల్లప్పాకం వాసనా, సెవులకు సప్పరింతలూ గాటుగా తగిలే తలికి దప్పికకు తట్టుకోలేక, పగ్గాం తెంచుకుపడ్డ గిత్తకిమల్లే గబిక్కిన లెగిసొచ్చి, రాములూ, సుబ్బులూకు ముంగల నిలబడ్డాడు రొప్పుతా నోటెంట నీలుగారుస్తా.

"కార్తే ముక్కుపెడ్తే తప్పెట్టా?" అన్నాడు పాపడు కళ్ళు మెరుస్తా.

"ఫ్రాఁ–" అన్నాడు రాములు.

"అమ్మా–" అంది సుబ్బులు.

తెలవకుండానే కొట్టుమిామ్మాన్నుంచి దూకినదూకటం సందుమలుపున బడి అరుస్తా, లగెత్తారు రాములూ సుబ్బులూ ఎనక్కి తిరక్కుండా.

"ఏందిరది పాపడూ?" అన్నాడు బజార్నపోయే రాగవయ్య.

"పెల్ల లెంటపడ్డాడూ" అన్నాడు బజార్నపోతుండ బసవయ్య.

"పసిపిల్లలు భయపడి పరుగెత్తుతుంటేనే!" అన్నాడు బజార్నపోతుండ కనకయ్య.

"ఏహె, దొంగమొగాన్ని లంబాడికొట్టో పడేదాకా ఓ పోటు పొడవండసె చూస్తారు!" అన్నాడు ముల్లుగర్రతో పొలంబోతుండ రాంకిట్టమ్మ.

*　　　　*　　　　*

ఆనాడు పాపిగివాళ్ళు కాకతగిల్నట్టుగుంది. లంబాడి కొట్టు మీాన గోడకు అదుముకుని కండవా కప్పుకుని కాత్తేకాత్తే వొనుకుతా ముడుసుక్కూకుండాడు. బయట ఓ పక్క నెల వంక పొడిసి ఎన్నెల అగుపిస్తుంటే యింకోపక్కనించి మేగాలు కమ్మి గాలి యిసుర్లో వానతుప్పర పస్తుండది.

తన బతుకు ముదనష్టకంగా వుండనుకుండాడు పాపడు. ఈ పెపంచకంలో రెక్కలిర్సుకుని కష్టపడే వోడి బతుకే అంతంతమాత్రం; యిగ కుంటిపచ్చి తన బతు కింకెట్టుండాల! అమ్మ బతికుంటే ఇప్పుడు తనకే ట్టుండేదో? అమ్మ బతికుండప్పుడు తనకాలు యింకా సడిపోలా. మార్కేట్టులో కూల్నాలి సేసుకుని బీడీముక్క గీడీముక్కకు కాణీ, అర్ధణాపోయినా దినాకి అర్ధరూపాయో పదణాలో అమ్మ సేతిలో పెట్టేవోడు తను. అమ్మ వొగ్గలాకు పుల్సుకూర ఎంతకమ్మగా సేసేది! కారం మెతుకులు పెట్టినా కడుపునిండేది! హుఁ సచ్చే యాడుందో! నా పెళ్ళికని-మరి ఎట్టా కూడబెట్టిందో ఏమో యిర్వై రూపాయిబిళ్ళలు దారంసంచీలో గెట్టిగాకట్టి యాడ్నో సూర్లో పెట్టిందంట! అట్నే కాత్తా ఎలికలు యీడ్సుకు బోయినయ్ అని ఓనాడు లబలబమంది. సేసింది తెలివి తక్కువపనయితే ఏడవటం దేనికని సేనంటే యినకనే

పోయిందిగా! యింక అటనే రాలిపోయింది, నా పెళ్లి కాలే దనుకుంటా. పోటమే మంచిదయిందిలే – ఒకటికి రెండు పానాలు అడుక్కుదింటా మాట్టం దేనికి? అయినా అమ్మ ఏమూర్తాన పోయిందో ఆనాట్నుంచే తను దిక్కులేని పచ్చయి పోయినాడు. తన కాలు పడిపోయింది. కాలు పడిపోకుండా ఎసువంటి వైద్దికం సేత్తే నయమవుద్దో వైద్దికుడికి తెలవాల్సిందే గాని, తనకెట్ట తెలుస్తద్ది? యింకాక్కీ తన మొగమ్మీన ఏందో రాసుండది. అట్టరాసుండకనేబోతే పెళ్ళోరూ తన మొగంకల్లి అట్టెందుకు సూత్తారూ? అనుకుంటా కాకరిచ్చి వుమ్మేసి, కండవా యింకా తత్తె బిగలాక్కుని, వొనుకుతా కూకుండాడు పాపడు.

ఈదురుగాలి కాత్తె తగ్గ వానజల్లు సాగింది. నెలవంక మబ్బుల్లోకి దూరి అటెటు లగెత్తుండది. ఎవురో కర్ర మోపు మీాన వొంగిపోయి, వొనుకులు పక్కటోంకి మలుపుతిరిగి సల్లగా రాటం కొట్టంగా సూశాడు పాపడు.

సూడు నాయుకుల కుక్క బొంయ్‌మంది, ఆ మడిసిని సూసి. ఆ మడిసి మాట్టాడకుండా వొచ్చి లంబాడికొట్టకాడ ఆగింది.

"ఈ కొట్టుమీాన కూకుంటే ఎవురేం అనరుగా?" అందా మడిసి కొట్టుఅరుగు ఎక్కుతా.

"కూసుని సూత్తే అదే తెల్సుద్ది" అన్నాడు పాపడు ఆ మడిసిని యిడవకుండా అటనే సూస్తా. గొబ్బిరిపీసుపాయులు దీసినట్టు ఆ మడిసి జుట్టు అట్టుండదేమనుకుండాడు పాపడు.

సన్నగా తీగెకిమల్లే వొంగిపోయిన ఆ మడిసి సల్లగా ఆ కొట్టుమూలకి సేరి గలగలమంటూ ఏందో సంచీకిమల్లే దింపుకని ఆడే నక్కి కూకుండది.

"ఏవ్వూరేం ?" అన్నాడు పాపడు కొట్టుమూలకి సూస్తా.

"ఏవ్వూరయితేయేంబాబూ, యింత అడుక్కొడిం టానికి ?" అంది ఆ మడిసి.

"చరేలే ! అయితే అడుక్కొడింటానికన్నమాట నువు యీడకి సేరింది - అయితే చరేలే !" అన్నాడు పాపడు.

"ఏం బాబూ అట్టంటావ్వా ? నాబోటోరికి యీన్నో కాడ అడుక్కొనికబోతే ఎట్ట గడుసుద్ది బాబూ ?" అంది ఆ మడిసి.

"బాబేంది బాబూ ? యీడ యీ లంబాడీ కొట్టుమీన బాబు లెవ్వరయినా యిట్ట వొనుకుతా కూకుంటారెట్టా ? ఇప్పు డంటే అన్నావుగానీ, తెల్లారి లెగిసినాక నన్ను బాబు గీబన మాక. నీ పేరేందేం ?" అన్నాడు పాపడు.

"జుత్తుపోలి" అంది జుత్తుపోలి.

"యిక్కాహ్ - మాబాగుందిలే" అంటా నవ్వుకుండాడు పాపడు.

మరసనాడు తెల్లారంగానే జుత్తుపోలి జోలి తగిలించు కుని, ఓసేత్తో తాడుగట్టిన చీనారేకు డబ్బా, యింకో సేత్తో కర్రా పట్టుకుని ఒంటెకి మల్లే మెడ జాపుకుంటూ వూళ్ళోకి నడి సెల్లింది.

"తసదియ్యా ఆడగూతురంటే అట్టుండాల !" అనుకుం డాడు పాపడు.

మరదేందో జుత్తుపోలిని ఆటే సూత్తుండకొద్దీ పాపడికి కడుపులో పళ్ళుబెట్టి కెలుకుతుండట్టయితుండది. అట్ట ఒంటెకి మళ్లే పెతిదినం ఎల్లి ఆడీడ ఏం గిరుకొచ్చుద్దో ఏమో ఆ మూలకి సేరి మాట్టాడకుండా, సప్పిడికాకుండా కూకుని ఏందేందో సప్పరిస్తున్నట్టుంటది. అదుక్కుదినేదానికి అంత సాటు దేనికీ? మీదబడి పీక్కుదింటారెట్టా! అదుక్కుని యింత నోరికితే తినేదీ, లేకబోతే పస్తుపండుకునేదీ, అంతేగాని అదుక్కు దినేనోరికాడ ఎవరన్నా గీసుకుదింటారెట్టా? మరి యిగనేంది యీ జుత్తుపోలీ? అదుక్కుదింటానే తనని సీదరిచ్చుకుంటుండది. ఏవ్వూరన్నా ఎల్లి అదుక్కుదింటే బాగుండు జుత్తుపోలి. వుండట్టుండి పాపడికి అనుమానం ఏసింది. జుత్తుపోలి తన మొగాన్ని వూళ్లోవోరికిమల్లేనే సూత్తుండదని- కడుపులో కెలికినట్టయింది పాపడికి.

ఆ రేత్తిరి యీదురుగాల్తో వానజల్లు పడ్తుండది వొనుకు పుట్టిస్తూ. ఆ రోజంతా పొందుకున్న పాపడు లెగవలేదు. సీకటి పడ్డాక వొకటి రెండుసార్లు కళ్లుదెరిసి కొట్టమూల సూత్తే జుత్తుపోలి అగుపించలా. ఆపైన మత్తులో వొళ్లు తెలవలేదు పాపడికి.

ఎంత రేత్తిరయిందో ఏమో - ఏందో సల్లగా తగిల్నట్టయింది పాపడికి. కళ్ళుదెరిసి సూశాడు పాపడు. ఒక యిగ్రహం తన పక్కన కూకుని సల్లగా తాకుతుండది. ఒక్కపాలి పాపడి నోరు తడారిపోయింది.

"ఎవరూ-?" అన్నాడు పాపడు యినపడకుండా.

"నేనేలే జుత్తుపోలిని. యియ్యాల ఏం తిన్లేదా నువ్వా!" అంది జుత్తుపోలి.

నోట **మాట** రాటంలేదు పాపడికి. తన వొంటిమీాన జుత్తుపోలి సెయి సల్లగా జివుజివున లాగుతుండది!

"లెగు– నాకాడ పుల్చుముద్ద వుండది తిందువుగాని రా." పాపడి రెక్కపట్టుకుండది జుత్తుపోలి.

తన ఒల్లు ఎందుకో వొంగుతుండదనుకుండాడు పాపడు. తనని జుత్తుపోలి ఎలేసిందనుకుండ పాపడు సీకట్లో జుత్తుపోలి మొగంకల్లి సూశాడు.

సల్లగా సెయిపట్టుకుని కొట్టుమూలకి నడిపిచ్చుకెల్లింది పాపణ్ణి, జుత్తుపోలి.



# రత్తి కోక కట్టింది

కిట్టకాలవకు నీరొచ్చిందంటే గూడెంలోవుండే కూల్జనం ఆ వాసన పీలుత్తా లెగిసి కూకుంటారు. ఆ వాసన పీలుత్తేనే ఆళ్ళ మొగాలకి రంగొచ్చద్ది. రంగురాటమంటే, కోత్లల్లో రాల్పుకుండ తిండిగింజలు ఎండదెబ్బలకిముంగల్నే నసుకు పోటాన, నడతీతసాగేతలికి నెర్రెబగిల్న రేగడిగడ్డన పీక్కబోయిన డొక్కల్తో పోల్లాస్తుండ జీవాలు, కిట్టకాలవతడి సల్లగా తగిలేతలికి, వానసినుకు తగిల్న కప్పలకిమల్లే బెకబెకమంటా తిండి గింజలకి నోళ్ళు దెరసుకు లెగసి కూకుంటారన్నమాట.

ఇగ సాగుతయి నాట్లు. నాట్లు సాగటవంటే కూల్జనం పుట్టబద్దలయిన పుసుళ్ళకిమల్లే రేగడి బురదలో బూమి యావత్తా యాడజూసినా తిరుగాడ్తా, పాటలుపాడ్తే, యీరంగా లేసు కుంటా, బురదనీలు సల్లుకుంటా, కోకలెగ్గట్టి, పంచలు బిగ్గట్టి, సిట్టలొచ్చి గింజను పట పట పట పొడుత్తా పోయినట్టు చిట పట చిట పట మిసినీకిమల్లే నారునాడ్తా పోతారన్నమాట.

నాట్లు రాటమంటే, రంగుకోకలు కట్టుకుండ కూల్జనం ముటాదాల్లు నాలుగు పక్కలా కోపేసి నడిపిత్తావుంటే కొప్పుల్లో పూలుదోపుకుంటా, నోట్లో పువాకముక్క ఏసుకుంటే ఏసుకుంటా, చీతాం అనుకుంటే చుబ్బాం అనుకుంటా, సేతిగాజులు సరిజూసుకుంటా, కాల కడాలు కొట్టుకుంటా, నాటుకు సోల్పున

పోతావుంటే పక్కపక్క అరుగులమీాన, రాత్తాపక్క సెల్ల మొగళ్ళకాడ కాత్తె సుమారైన వ్రాణిజనం నడుంకట్లేసుక్కూకుని, పువాకు యీానెల దీసుకుంటా నోళ్ళు దెరసుకు నీఁబ గారుత్తా సూత్తావుంటారన్నమాట.

ఈ యవదానంలో—కోడి పెట్టెవగుడ్డు పిల్లయి కూకుండట్టు—నిన్న మొన్నదాకా ఎలికతోకల జడలేసుకుని ఏ అరుగుల మొత్తల్నబత్తే ఆ యరుగు మొత్తలకాడ తచ్చాడ్తావుండే పిల్లముండఁబ యిట్ట తెలవకుండానే వుడట్టుండి, రంగు కోక లెగ్గట్టి నునుపెక్కన కట్మత్తో ఆ నజాన కూల్జనంలో పడి పోతావుంటే, కూకుని పరీచ్చగా సూత్తావుండ అసువంటి సుమారయిన వ్రాణిజనానికి నరాలపొట్టుదప్ప నీలుగాత్తయ్యన్న మాట.

అయితే యీామద్దెనే కాత్తె పెద్దమడ్సయిన రత్తికి ఎలిక జడబోయి బత్తికిమళ్లే కొప్పొచ్చి, పోయిన మార్గాలపండక్కి జేజి కొనిబెట్టిన ఎర్రకోక ఎగ్గట్టి, తెల్లగన్నేరుపూలు కొప్పులో తోపుకుంటా, అంపన్లోబడి నాట్లకి ఎల్తావుంటే సూత్తాకూకుండ నలుగుజ్జనానికి తను ఎట్టగుపిత్తావుండద ఎట్ట తెల్సుద్ది?

శివమ్మగారి శివయ్యా, బసమ్మగారి సుబ్బయ్యా రాత్తా పక్క సింస్బెకింద పువాకు యీానె ల్దీసుకుంటా ఎల్తావుండే కూలి జనాన్ని - వూరకనే సూత్తా కూకుండారు.

'సుబ్బయ్యా?'

'ఏందిర శివయ్యా?'

'ఆ పొయ్యే మడ్సి మన రంగయ్య కూతురు రత్తేస్సా?' అన్నాడు శివయ్య మీాసకట్టు తుడుసుకుంటా.

'అదే సూస్తున్నా!' అన్నాడు సుబ్బయ్య రత్తిపోకడ కనిబెడ్తా.

'ఎదిగిందే!' అన్నాడు శివయ్య.

'పొండుకుమల్లే పండింది!' అన్నాడు సుబ్బయ్య.

'తల్పుండమొయు, బల్‌గురిగా వొదిలావే మాట!' అన్నాడు శివయ్య సుబ్బయ్యను అట్టొక సూపు జూసి.

'ఉండ విషయం అది సెప్పొద్దూ!' అన్నాడు సుబ్బయ్య సిన్నగా నవుతా.

'సినిమాకిమల్లే వుండదే!' అన్నాడు శివయ్య.

'సినిమా ఏందిరోవ్ శివయ్యా?' అడిగాడు సుబ్బయ్య.

'ఏహె మొన్నంటే మొన్నద్దాకా ఎలికతోకకుమల్లే ఇంత జడేసుకుని తిరుగుతుండేదంటే!' అన్నాడు శివయ్య.

'ఎవరు రత్తేనా? యీ మద్దెనే పెద్దమడ్స యిందంటలే' సెప్పాడు సుబ్బయ్య.

'యిగనేం, యిచారిస్తా వుండావన్న మాటా? మరి మనిషే కొత్తదన్నట్టు మాట్టాడ్తావేరా సుబ్బయ్యా?' అన్నాడు శివయ్య.

'ఓరిపోరా ఎంతసెడ్డా నీకుండంత రంది నాకేడుంది!' అన్నాడు సుబ్బయ్య.

'మరి జాడా తియ్యంది నీకెట్ట తెల్సురా అది పెద్దమడ్స యిందనీ?' అడిగాడు శివయ్య.

'అంతేనా! మడ్సినిజూత్తే ఆ మాత్రం తెలవదెట్టా? అయినా? నీకు నాకుమల్లే నలుగురు అనుకుంటావుంటే

యియన్నీ యినిపిచ్చుకోకబోయినా తెలుస్తావుంటయ్యే ?'
యిడదీసినట్టు సెప్పాడు సుబ్బయ్య.

'అంతేననుకో' వొప్పుకున్నాడు శివయ్య.

'ఆళ్ళ జేజి తెలుసా ?' అన్నాడు సుబ్బయ్య.

'ఎవరి జేజి ?' అన్నాడు శివయ్య.

'రత్తి జేజంటే ?'

'ఎవరు గోసెమ్మేనా ? అదిగేం రత్తి పక్కనే ఎల్తా'.

'పక్కనే ఎల్తుండదంటావూ. కరుసుకుని ఎల్తుంటే ?'
అన్నాడు సుబ్బయ్య.

'కాపలా ఎట్టా ?'

'మరేంది ! అబ్బో యీ ముసలోళ్ళ సంగతి యింకా
నీకు బాగా తెలవదుగావాల్ను – చరేలే ! అస లీ గోసెమ్మ
మాటకి ముంగలే కోక తెస్తున్దంట !' అన్నాడు సుబ్బయ్య,

'ఏంటి, రత్తిమీద ఎవరన్నా కన్నేస్తారనేనా ?'

'అదే దానాట.'

'ఆఁ, ముసల్ది ! ఓరిపోరా యీ గూడెంజనం మనకి
కొత్తంటా ! అస లెందుకు ఫద్దినాలు నువ్వు వోపికపట్టి సూడు,
యవారం ఎట్టదిరుగుద్దో సెక్రం దిరిగినట్టు!' అన్నాడు శివయ్య.

'ముసలాళ్ళకి కక్కుర్తి బాహు జాస్తంటలే' యింత
సిన్న ఎండిబిల్ల సేతిలో బడ్తేసరి' అన్నాడు సుబ్బయ్య.

'మరిగనేం !' అన్నాడు శివయ్య.

'అన్నట్టు ఎంకట్రామయ్య నాల్దినాల్నుంచి యీ
గోసెమ్మోళ్ళ గుడిసెలకాడే తిరుగుతావుండాడంట దేనికనబ్బా?'
అన్నాడు సుబ్బయ్య.

'ఎవరు అంకమ్మగారి ఎంకట్రామయ్యా ?'

'మరింకెవరు ఆడుగాకుంటె ?'

'ఆరి – ఆణ్ణోపాలి నలగబొడవాల్సిందే!' అన్నాడు శివయ్య.

'పెళ్ళోడికన్నా రత్తిమీనే! అందుకే ఈడు జేరాడా–' అన్నాడు సుబ్బయ్య.

'నువ్వుమటుకు వూరకనే వుండేవోడివికాదే!' అన్నాడు శివయ్య.

'చా, నీతోడు! అసలు గూడెంసాయలకి ఎల్లే వారం పద్దినాలయితే! యింకా నువేమన్నా బోగట్టా జేశావేమోనని అడుగుదామనుకుంటుంటే ?' అన్నాడు సుబ్బయ్య.

'ఏంది–? తెల్సుండమొయ్ నువ్వురా మనగాడివంటే సుబ్బయ్యా! అసలందుగ్గాదూ నీకు కళవాదుమణేలాఅని పేరొచ్చింది! పేడతెక్కడని కతో ఉండదిలే; అట్టుండది నీ యవారం జూస్తే.

'అబ్బే గూడెంక ల్లేమన్నా ఎల్తుండావేమోనని అడిగాలే' అన్నాడు సుబ్బయ్య.

'ఎహె, యిదియ్యాల కోకగట్టుకు అగుపిస్తే చూడ్డా ల్నొచ్చిందిగాని యింతకీముంగల దీనిమొగం ఎవరుజూశారూ?' అన్నాడు శివయ్య.

'అన్నట్టు రోసెమ్మోళ్ళు ఎంకట్రామయ్య సేనుకే నాట్లుకుపోయింది, తెల్సా ?'

'ఆఁ ! తన్నదియ్యా, ఆడ్డా వొంటిసేతిమీద యవారం నడుపుతాడూ ! అప్పుడే జాడాదీశావే - నువు వూరుకుంటా !' అన్నాడు శివయ్యా.

'ఆఁ, యిందాక ఎంకయ్యంటుంటే తెల్చిందిగాని లేకబోతే నాకిదేసెట్టా పనీ - యింకా నయం !' అన్నాడు సుబ్బయ్యా.

'మరి నువు యింకా మొదలుపెట్టించలేదేం నాట్లూ ?' అన్నాడు శివయ్యా.

'యింకా నీరెక్కందే ! మీరో ?' అన్నాడు సుబ్బయ్యా.

'మాదీ మీతోపాటే అవుతుందిలే. అన్నట్టు మంగి ఏమంటున్నదీ ?' అన్నాడు శివయ్యా.

'అదా —! అబ్బే దాని మొగంజూసే నాలుగయిదు నెల్లయితే, ఆ రోజులన్నీ పోయినయిలే శివయ్యా, యిప్పుడేందో మనదార్న మనంపోతే బాగుండు ననిపిస్తున్నది' అన్నాడు సుబ్బయ్యా.

'అబ్బాబ్ ! యీ సుబ్బయ్యా పెద్దమడిసై తుండట్టుందే! ఓరి పోరా నాకాడంట నీపాద్సా ? కిందట నూర్పిళ్ళప్పుడు కదంట్రా మంగిని ఆ డొంకలకాడ దారి దప్పించి మీ సాయిడి లోకి తీసికెల్లిందీ !' అన్నాడు శివయ్యా.

'సరేలే ! యింతే నన్నమాట నీకు తెల్చింది ! ధానంతట అదేగా ఎంటపడిందీ !' అన్నాడు సుబ్బయ్యా.

'ఓరి పోరా నీ మాటలకేం వొచ్చిందీ ! మంగి సంగతి నాకు తెలియదూ, లబోయ్ దిబాయ్ మంటూ అదావజాన ఏడ్సిబోతే ?' అన్నాడు శివయ్యా.

'నీ కాడికొచ్చి ఏడ్సుకుండదేం? ఓరి పోరా నువ్వుమటుకు దాన్ని వూరకనే పోనిచ్చావంటా?' అన్నాడు సుబ్బయ్య.

'నేనా—! తెలవక ఏదో ఒక్కపాలి బుద్ది గెడ్డి తిన్నదనుకో. ఎట్టయితే యేం అదేం ఆశబెట్టావో ఏమో సివరకి అది ఎటూ గాకుండా ఎల్లి, ఆ ముసలోణ్ణి పెళ్లిజేసుకుండె!' అన్నాడు శివయ్య. 'సరే, దానికి ఆ ముసలాడే దేముడికిమల్లే వుండే! పోనిద్దూ యిప్పుడెందుకొచ్చింది ఆ పాతపురానమంతా,' అన్నాడు సుబ్బయ్య.

'నిజమంతే ననుకో,' అన్నాడు శివయ్య.

'రత్తి బహుగెట్టిది – అది నడకెట్ట నడుసుద్దో సూశావుగా?' అన్నాడు సుబ్బయ్య.

'సూసేతలికే కరెంటుకొట్టినట్టు తల్దిరుగుతే?' అన్నాడు శివయ్య.

'అయినా వుత్త పిల్లముండలే?' అన్నాడు సుబ్బయ్య.

'యియ్యాలేగా అది కోకగట్టింది?' అన్నాడు శివయ్య.

'అంతేననుకో నీకాడ చేజోలు పువాకుండట్టుందే—?'

'కావలెట్టా?'

'కావాలా—? తేతేతే—'

* * *

తెల్లారి సింగారిచ్చుకు నాటు కెల్లిన రంగకోకల కూల్జనం మాపిటేలకి పంటకాలవలకాడ, సెరువు సెప్టాలకాడ, వొంటి మీన ఆసీడ కొట్టుకుండ బురద – కాళ్ళ కడాలూ, సేతి గాజులు సుబ్బరంగా కడుక్కుని, గీగామంటా కూలిగింజలు కొలిపిచ్చుకునేవోరూ, యింటికాడ పిల్లోళ్లేడుత్తా వుంటారని అటెటు

లగెత్తేవోళ్ళూ, బువలోకి మిరపగాయ బొరపగాయలనీ, ఎర్ర గెడ్డ తెల్ల గెడ్డలనీ, మరసనాటికి గొబ్బరిసప్పలు ఎట్టననుకుంటా చీసాకాయిలకి లగెత్తేవోరూ, మొగోళ్ళకి పువాకనుకుంటా, బుడ్డోడికి కాత్తేమన్నా పెట్టమంటా ఊళ్ళో ఆమూల, యీమూల, కోవంటికొట్లకాడ కాళ్ళకడాల మోత బుట్టిచ్చి, సివరకి తోసేసినట్టు ఎటుజనం అటు సల్లసల్లగా గూడెం సేరు కుండారు.

కొత్తగా కోకగట్టి జనం మద్దెకొచ్చిపడ్డ రత్తికి ఆయాల మనసంతా – బిర్జిమీన రవిలుబండి లగెత్తినట్టు – కొట్టుకుంది. అదేందో రాత్తామీన నడుత్తున్నంతలెక్కా పక్కపక్క అరుగులమీన, సెట్లకింద కూకుండ మొగజనం రెండేసి రెండేసి బారల ముల్లుకర్రలు దీసుకుని తన ఎర్రకోకమీన పొడుత్తా వుండట్టే అనిపించింది రత్తికి. యీ మనుసులు తను యిన్నాల మించీ ఎరిగిన మడుసులు కారు. యీళ్ళ కళ్లు కోటయకొండ తిరనాల్లో నెలట్రీ దీపాలకిమల్లే దగదగ మెరుత్తుండయి.

'నాటేస్తున్నంత లెక్కా ఆ ఎంకట్రామయ్య పొద్దు తిరుగుడు పువ్వుకుమల్లె తనెటు తిరుగుతుంటే అటు తిరుగుతానే వుండాడు. అయినా ఎర్రకోక బొహలు బాగుంది. చీతాయ్, ఎంకాయ్, యీరాపులు ఎర్రకోక ఎట్టుండా వుండదన్నారు. అందుకేగా వాలు రాత్తాపక్క జనం అట్టాజూశారు? అయినా యిదేంది పాడూ, కొత్తకోక కట్టుకుంటే పొడిసినట్టు ఆవజాన సూడాలెట్టా? చీ పాడూ, చిగ్గేసుద్ది! అదేందిమరీ ఆ ఎంక ట్రామయ్య యాడో జబ్బునపడి లెగిసినోడికిమల్లె అట్ట

జూత్తాడూ! నిజంగా అదేందో జబ్బే యీళ్ళకి - యాంమో పాడు-' అని ఎట్టెట్టనో అనుకుండది రత్తి.

అయ్య బువదిని బయట మంచాం ఏసుకని సెంచుకర్ర ఫూదుకుంటూ కూకుండాడు. జేజి అమ్మకీ, పిన్నావుకూ, రత్తికి కంచాలు పెడ్తావుంది బువ దింటానికి.

ఆయాల్దాకా కుండలో గాబుల్లో పిన్నావుతో బాయి కాణ్ణుంచి నీలుదెచ్చి పోత్తావుండ రత్తికి తెల్లారినాట్లకు తన కొత్తకోకమీన బురదమచ్చ లుంటయ్యానిపించింది.

'అమ్మోవ్, సెరువుకాడ కోక జాడిచ్చుకొత్తానే!' అమ్మ నడిగింది రత్తి.

'యీవర్దాకా ఏంజేశావే - తెల్లారి జాడిచ్చుకుందువులే' అంది అమ్మ.

'నాటు కెళ్ళేయాలకు ఎట్టారుద్దమ్మా! దొబ్బు నెల్లొత్తానమ్మా' అంది రత్తి.

'ఓ యబ్బో! కొత్తకోక గట్టిందిగాని నాటెయిదు గావాల యీపిల్ల! ఏం అదిరిపడ్తుండదమ్మోవ్ నీ కూతురూ! యిగ సాల్లే సంబడం, పెట్టెలో దాసుకో పండక్కి- బొండక్కంటూ కట్టుకుందువుగాని. యియ్యాల కట్టుకుండది సాల్లే - నిచ్చేపమంటి కొత్తకోకసిగాత్తా బురదనీల్లల్లో పొల్లిచ్చుద్దంట సూడమ్మోవ్ నీ కూతురు!' అంది జేజి.

'ఆఁ, యీవిడే మాగాంగా కొనిబెట్టింది; మా అయ్య నడిగి నే నింకోటి కొనిబెట్టిచ్చుకోననుకుండావా?' అంది రత్తి.

'అయ్యో వగలూ! మీ అయ్యోకటి కొనిబెడ్తే నీ మొగుడెన్ని కొనిబెడ్తాడే పిల్లా!' అంది జేజి ముచ్చటగా.

'తెల్లారి లెగు స్తే యీాయిడ కెప్పుడూ మొగుళ్ళే - సూడమ్మా?' అంది రత్తి.

'అమ్మ బుల్లో! యిప్పట్నుంచి ఏం ఎగిరిపత్తుండ దమ్మోవ్, నీ కూతురూ! సూత్తుండావుగా, యిప్పుడెల్లి ఆ చెరువుకాడ కోక జాడిచ్చొచ్చాట నీకూతురు!' అంది జేజి.

'అయితే నువ్వు కూడు దినవంటే రత్తీ, మేం కూకుం టుండాం, యీామోానమ్మ యీాపిల్లతో సావుగుండది,' అంది అమ్మ.

'దానికి కోకతోనే కడుపు నిండుతుండె,' అంది పిన్నాం, కంచాంకల్లి సూత్తా.

'రేప్పటికి పరికిణీ కట్టుకోరాదంటే? యిప్పట్నుంచీ కోక లేందమ్మా యీా పిల్లకూ?' అంది అమ్మ.

'యిగ సాల్లే వూరుకో! యింకా పరికినా లేపిచ్చొద్దంట యీావేందో! పిన్నాం కోకేవన్నా కట్టుకుందువులే యిప్పు డేడకి బోతావు నీకట్టో,' అంది జేజి.

'ఆడ నాకుమటుకేం వుంచెయ్యావమ్మోవ్ కోకలూ,' అంటన్నది పిన్నాం.

'వుప్పుడు నీ బంగార మేం పీక్క దిన్లేదులే నువ్వు వూరుకో మ్మా. గాబుకాడ దొబ్బున జాడిచ్చుకురారాదంటే యీాడికో వుప్పుడు పడిబోకబోతే?' అంది అమ్మ.

'సచ్చేట్టు దెచ్చిన నీలన్నీ వుప్పుడీమె కోకలు జాడిత్తా కూకుంటదిగావాలు?' అంటున్నది పిన్నాం.

'నువ్వేమ్మా తెచ్చిందీ? సూడమ్మా-?' అంటన్నది రత్తి.

'యిగ యియ్యాల యీాళ్ళలో కూడుదిన్నట్టే! గబగబ బావికాడ కెల్లి రెండుబుంగలు నీలు దెచ్చుకుని యీాడే గుంజాలో రాదంటే కోకా - ఎల్లవేందే రత్తాం?' అంది అమ్మ, పేసీ లెందుకంటా.

'ఆవ్!' అంది రత్తి బుంగ సేతబట్టా.

'పిల్లముండను ఒక్కత్తెనే సీకట్లోపంపుద్ది?' అంది జేజి.

'ప్రూ, నంగనాసి- నే లెగవలేనమ్మా వుప్పుడు-అసలే వొల్లంతా యిరగ్గొట్టినట్టుంది,' అంది పిన్నాం.

'నిన్నెవురేం రామన్లా పాపం—' అంటన్నది రత్తి.

'యిదిగో రత్తాం' అంటా యిసుగుతో అమ్మ లెగవక తలికే బయట పెంచుకర్ర మైకంలోపడ్డ అయ్యని దాటి రాత్తా మీానకొచ్చి వాలింది రత్తి బుంగా, సేదతో.

పెయ్యదూడను పాల కొదిల్నట్టు - మద్దె మద్దె అరీసు సూడకుండా - ఎగిరెగుర్తా గబగబ బాయిదగ్గరకి పేర్తావుండ రత్తికి, ఎంకట్రామయ్య గొడ్లసావిడికాడి కొచ్చేతలికి తత్తర బుట్టింది.

'ఎవరా ఎల్లేది?' అన్నదా యిగ్రహం దారిమయాని కొచ్చి నిలబడ్డా. అది ఎంకట్రామయ్య కంటం. మట్టిబుంగ తాప్పున బూమ్మీానపడి ఎయ్యిసెక్కలుగా పగలాల్చిందిగాని- తెప్పకొయ్యని కరుసుకుండట్టు కర్సుకుంది బుంగకు రత్తి.

'ర-ర-ర-ర-త్తిని-' మాట కొట్టుకుంది రత్తికి.

ఎంకట్రామయ్య ఎందుకో సప్పరిత్తుండా డనుకుంది రత్తి.

'యాాడికో ఎగురుకుంటా పోతావుంటావే - ఎనక మీా జేజి లేదెట్టా?' అన్నాడు ఎంకట్రామయ్య సేతులు పిసుక్కుంటా.

'కోకజాడిచ్చుకోను - దొబ్బున - ఎల్లమంటేనీ-' రత్తి నాలిక మడ్తబడింది.

'యిగనేం - యిదిగో-' సీకట్లో అటేటు సూశాడు ఎంకట్రామయ్య.

'ఆఁ-?' అంది రత్తి.

'కాత్త నీతో పనుండదే-'

'ఓమ్మో-!'

'ఏహే ఊరకనేలే అరవమాకా - యిప్పుడే ఎల్దువు గాని, సాయిట్లోకి వొత్తావెట్టా-?' ఎచ్చగా ఎంకట్రామయ్య సావిడి గోడసాటుకు లాగాడు రత్తిని ఏం లేదంటా.

'ఏంకీ - యీడికో అస్సగుంటూతాడేం - యిదేంసమ్మో- వామ్మో-' ఎంకట్రామయ్య కళ్లు వెలుట్రేకిపాలకిమ్మత్తే అట్టలిగినయ్యో లేదో, యిదిలించి దూసుకుండ దూసుకోటం- ఎల్లి బాయికాడ ఆపురావురుమంటా పడ్డోసెరు నీలుతాగిన రత్తికి వొల్లంతా సెమటలుబట్టి గుడ్లొడిసిన్నై.

'ఎప్పుడు - ఏది రత్తో అదేముయిన నీలు దాగుతుండావ్?' అన్నది నీలకొచ్చి నిలబడ్డ సీతాం,

'ఎవరు - సీతాం - యెవరు - సెప్తదప్పికయిందే సీతాం - సీతాం -?' అంది రత్తి దడదడమంటా.

'ఏందే రత్తి?' అంది సీతాం.

'నువేనా, యింకా ఎవురో అనుకుండాలే - దొబ్బున నీలు లాగమ్మో యిద్దురం కాత్తెలెక్క కల్చేద్దాం -'

సీతాన్ని సాటు జేసుకుని ఎంకట్రామయ్య సావిడిదాట్న రత్తి యింకా త్తెలెక్క బోయినాక యిగ పరవాలేదనుకుంటా

చీతాంతో సీలి గబగబ యింటికి మల్లింది ఆడీడ ఎల్దురు సూసుకుంటా.

గబగబ యీాది మలుపుకుండా వొచ్చి – పొలుగు దిగేసి నట్టు అటనే నిలబడిపోయి – అట్ట మొగంమీానకి తొంగిసూసిం దా యిగ్రహం.

'ఎవురూ – ?' అంది ర త్తి, చినిమా జూసినట్టయి.

'నే సుబ్బయ్యాన్లే – మా శివయ్యేమో ననుకుండా లే– నువు ర త్తివెట్టా ?' అన్నాడు సుబ్బయ్యా జరుగుతా.

'వుండు ఎల్లాల –'

'ఎల్దువులే – '

'యిగ సాల్లే లెగు – '

'ఎవురూ లేర్లే' – అంటన్న సుబ్బయ్యాకు పటపటపట సరాలు తెగినట్టయి సేతులు లెగుత్తుండయ్యో లేదో –

'టాప్' మని యీాపుమీాద పెట్లదిమ్మ మోగేతలికి – బత్తా ఎత్తేసినట్టు – బూామ్మీానకి పల్టీకొట్టి పొండుకుండాడు సుబ్బయ్యా.

'యదవా !' అన్న దాయిగ్రహం సుబ్బయ్యాను వొంగిసూాత్తా.

'ఓరి శివయ్యోవ్ – సత్తిన్నా –' అని మూలిగాడు సుబ్బయ్యా యాంపుమీాన సేతుల్తో అటనే లెగిసి కూకుంటా.

'ఎవురు సుబ్బయ్యా – సచ్చావ్రా నాయినా – ' గబగబ సుబ్బయ్యాను వాటేసుకుని లెగవదీశాడు శివయ్యా.

'యిదేందిర శివయ్యోవ్ –'

'అరెరెరె - ఎంకట్రామయ్య ఏటుకు సచ్చాడనుకుంటిని గండట్రా సుబ్బయ్యా -'

'పాళూడ్గన్నండ్రా - కాత్తై వాతేసుకోరా నాయనా -'

*                    *                    *

ఆ రేత్తిరి ఎర్రకోకసుట్టూతా వెలట్రీదీపాలు గిర్ గిరా తిరుగుతూ టావ్ టావ్ మంటూ పగుల్తుండట్టు కలగంటన్న రత్తి సుట్టూసల్లగా లెగిసిన జేజి యింత పుప్పాగల్లు దిగదుడ్సి బారేసింది.



# పాలెంలో బొమ్మలాట

ఎంకటసుబ్బయ్యగోరి బుడ్డజీతగాడు సూరాయి నెత్తిన కండవా ఏసుకుని ముక్కు ఎగదోసుకుంటా లోన ఏందేందో గొనుక్కుంటూ సత్రంకాడ రావిసెట్టుదెగ్గిర కొచ్చేతలికె ఆడ తోలుబొమ్మలాట పందిరి అప్పుడే తెగిసి సూత్తండది. పందిరి అట్ట సూసీసూడకతలికే నీలకుండ పగిలి నీలుకార్నట్టు సూరాయి పానం ఆటనే దిగిజారిపోయింది.

అసలు సూరాయి యిసువంటి బొమ్మలాటలు సూసే పద్దతే వేరు. బొమ్మలాట ఆడేనాటికి పద్దినాల ముంగల బలానిదినం బలాని సోట, బలాని ముటావోరు, బలాని తోల్బొమ్మలాట ఆడ్తారని వూరికి ముంగల సూరాయి పెతోరికీ సెప్పాల. ఆ మయిన ముటావోరు వూళ్ళోకొచ్చి దిగినాక ఆ రందన్తో పరాసికాలాడ్తా, దెగ్గిరదెగ్గిర తిరిగి పందిరి ఏసేయాలా, బొమ్మలాట మొదలు బెట్టేముంగలాకుర్ర సంచును పందిరి సాయలకు రానీకుండా ఓ కోపు కాత్తా, మద్దె మద్దె ముటావోర్కి వుసారెక్కిత్తా వుండాల. అసువంటి పద్దతి యిప్పుడు పెడదిరిగింది.

ఎప్పుడో పద్దినాలకి ముంగలే తెల్చింది సూరాయికి నాంచారిముటా వొచ్చి పాలెంలో సత్రంకాడ రావిసెట్టుకింద బొమ్మలాట ఆడబోతుండారని. ఈ సమాశారం అట్ట

తెల్చిందో లేదో ఎంటనే సూరాయి గెహించాడు. అయ్యోతనిని ఎంకటసుబ్బయ్యగోరింటో జీతానికి కుదుర్స్తా ఆరి గొడ్లసాయిట్లో గొడ్లతోబాటు కట్టేసి పోయ్యాడని;

కన్నీళకటి పడేయాలకి ఫుగాకుపాయలు సీల్సుకుంటా ఎంకటసుబ్బయ్యగోరు పాలెంలో బొమ్మలాట యవారాలేందో యిశారిద్దామని బయటెల్లి అట్ట మలుపు తిరిగాడో లేదో సూరాయి గొడ్లసాయిట్లోంచి సల్లగా జారి సత్ర-కాడికొచ్చి నిలబడ్డాడు.

తొల్గారి నాంచారి ముటా సెరువుగట్టుమీనకుండా పాలెంలోకి రాటం గొడ్లసాయిడి గోడెక్కి ఎప్పుడో సూశాడు సూరాయి. ఇం కూసేపటికి నాంచారి ముటా బాపనయ్యో బజార్లోకొచ్చి వోత్తావుంటే ఎనికెత్తే కొండాయ్, కోటాయ్, కాంతాయ్, రంగాయ్, రత్తాయ్తోబాటు జడెగెక్కుంటా సీతాయి రావటం సూసిన సూరాయి సాయిడిసూరుకు అటనే కరుసుకుబోయ్యాడు.

నాంచారి ముటా పాలెంలోకి జేర్నట్టు తెలిసి మోత తెగిసి పోతావుంటే, యీడ గొడ్లసాయిట్లో సందేలదాకా నెవరేత్తా కూకుండ సూరాయి ఎంకటసుబ్బయ్యగోరు అట్ట ఎల్లి సందు తిరగనే తిరిగేతలికి కూతకూసి ఎలకాడకొచ్చిపడ్డట్టు సత్రంకాడికొచ్చిపడ్డాడు.

అయితే ఏం-పందిరి అప్పుడే తెగిసి కూకుండది. తన సెయి తగలందే ఆ పందిరి తెగిసి కూకుండది! మందనించి దారి దప్పిన దూడకిమల్లే పందిరి సుట్టూతా సూత్తుండ సూరాయికి పందిరికి కాత్తె పెడగా కోపుగాసిన పోలీసులకిమల్లే కొండాయ్,

కోటాయ్, కాంతాయ్, రంగాయ్, రత్తాయిలు సోల్పున నిలబడుంటం పయినంగా అగుపించింది. ఒక్కపాలి యీపుమీాన ఉలరదమట్ట పాకినట్టయింది సూరాయికి.

అయ్య తనని ఎంకటసుబ్బయ్యగోరి గొడ్డసాయిట్లో కట్టెయ్యకనేబోతే తనకన్న ముంగలగా కొండాయి ముటా అనజాన ఆడ నిలబడుండేదేనా ?

"ఆర్నీ సూరాయ్ !" అని అరిశాడు కొండాయి.

"ఆర్నీ సూరాయ్!" అనరిశారు కోటాయి, కాంతాయ్, రంగాయ్, రత్తాయిలు.

"ఆళ్ళదే యీాడ పెత్తనం. తనని పదామడ ఎనిక్కి నెట్టారాళ్ళు" అనుకుండాడు సూరాయి.

"ఓరి రార్రారి సూరాయోన్!" అనరిశారు కొండాయి ముటా.

"ఆళ్ళమ్మోళ్ళు ఆళ్ళని యీాడికిగ్గోతానంటే ఆడకి పోనిత్తారు. ఆళ్ళమ్మోళ్ళు మంచోళ్ళు" అనుకుండాడు సూరాయి.

"ఇంటికెల్లి యిప్పుడే వొత్తాలేరా !" అంటా సూరాయి అట్ట ముంగలికి ఒక్క అడుగు ఏశాడో లేదో లంబాడి కొట్టుపక్కనించి కర్లకిమళ్లే వొత్తుండ ఎంకటసుబ్బయ్య గోరు అట్ట అగుపించేతలికి, యిగ అట్టనే ఎనిక్కితిరిగి లగెత్తిన లగెత్తడంర త్తమ్మసందుమలుపుకాడికొచ్చిపడ్డాడు సూరాయ్.

"ఒరేయ్?" అంది మలుపు మొత్తనుండ ఆ యిగ్రహం.

"అమ్మ సత్తిన్రో రయ్యో"– అంటా అటనే ఆ యిగ్రహా
మిమ్మానకు వారెగాడు సూరాయ్ సీకట్లో ఏది ఏదయిందీ తెలవక.

"అమ్మ సంపావురా సూరాయో" అందా యిగ్రహం
సూరాయిని గట్టిగా వాటేసుకుంటూ.

"ఎవరూ!" అన్నాడు సూరాయి యిగ్రహం జడ సేతికి
తగిలేతలికి కాస్తె తెప్పరిల్లుకుంటూ.

"సీతాయిన్రా నేనూ, సంపితివిగదంట్రా సూరాయ్."

"సీతాయ్! నువ్వేనంటే?"

"నేనేరా సూరాయ్."

"ఆసి నువ్వేనంటే నిజంగా? అడలుకు సత్తినిగదంటే
దెయ్యాం పీకనేపీకిందనీ–"

"ఛీ సచ్చినోడా అరవమాక."

"అవరన్లేయే సీతాయ్, ఇగిగో, ఏందే నువ్విడ సేస్తుం
డదీ?"

"నువ్వు అట్నుంచి లగెత్తుకురాటం సూసి యిండ యిట్ట
నిలబెట్టానూ, ఆమైన నువొచ్చి మాట యినిపిచ్చుకోకుండానే
మీదబడ్తివి!"

"సంపావుగదంటే!"

"స్నాల్లే వూరోర్–ఇంకా మీనబడీ, సూడయ్యా పాపం!"

"తెల్వలేదు లేయే సీతాం – దెబ్బతగిలిందంటే! పానీలే,
మరి యెందుకే మూలనుంచుండావూ?"

"నీకోసమే రా"

"నా కోసమాంటే?"

"అవున్రా"

"ఎందుకే నా కోసం ?"

"ఒరే సూరారాయోవ్, నే బొమ్మలాట కెల్తుండాగా ?" అంది సీతాయ్.

"యేంది ?" అన్నాడు సూరాయ్.

"నే నాంచారయ్య బొమ్మలాట కెల్తుండాగా! మా జేజి నన్ను తీసికెల్తానంది ?" అంది సీతాయ్.

"నిజింగా నంటే ?"

"సజంగా నేరా, కావాలంటే మా జేజి నెల్లిఅడుగు. తెలుస్తది."

"మీ అయ్య ఎల్లమన్నాడంటే ?"

"అయ్యా, మా అమ్మా అంతా ఎల్లమన్నారు నన్ను."

"పానీ లేవే సీతాం, నీకేం, నువు ఎట్టనన్నా ఎల్తావు."

"అదేందిరా సూరాయ్ ? మరి నువ్వుగూడా రాటం లేదంట్రా ?"

"మా అయ్య నన్ను పోనీయడు."

"ఎందుకని పోనియ్యడ్రా మీ అయ్య నిన్నా ?"

"ఎంకట సుబ్బయ్యగోరి గొడ్లసాయిడి యిడిసి రావద్దంటాడు."

"అదేందిరా ? బొమ్మలాటన్నా సూడనీయడంట్రా మీ అయ్య ?"

"నీకు తెలవదులేయే మా అయ్యసంగతీ."

"మొదలు నీ వడిగావంట్రా మీ అయ్యనూ?"

"నే నడక్కేం! ఎందుకనమ్మా, నాలుగు తన్నించుకోనా ?"

"వృత్తినే తంతాడంట్రా మీ అయ్యా?"

"వృత్తినే ఏం తంతాడో తెలువదుగాని - ఎట్టానబ్బా?"

"ఎట్టనేందిరా ఎల్లి అడక్కా, మొగులు అడక్కుండానే ఎట్టానంటాడేం? ఒరేయ్ అంతమంది బొమ్మలాట సూత్తాంటే, నువ్వు సూత్తే మీ అయ్య తప్పంటాడేంట్రా?"

"అనడనుకో, మరి యీ ఎంకటసుబ్బయ్యగోరి గొడ్డ సాయిడి సంగతేమంటా?"

"ఆళ్ళుమాత్రం రారంట్రా బొమ్మలాటసూడనూ?"

"ఎందుకు రారూ! ఆళ్ళొచ్చే సన్న గొడ్డసాయిట్టో పండుకోమంటారు."

"ఏందిరా అనేసే, ఆరి గొడ్డసంగతి ఆరికన్న నీ కెక్కు వెట్టా?"

"బలేదానివే యింకా నయం! అయితే నాకు యిచ్చిచ్చి జీతానికి పెట్టుకుండది పని ఎగ్గొట్టమనెట్టా?"

"ఎవ్వు రన్నారూ, రేత్తిరి గొడ్డ నిదరబోతుంటే నువ్వాడ దేనికంటాడుగానీ? ఒరేయ్ బొమ్మలాటన్నా సూడక బోతే యింక నువ్వేం మడ్సివిరా?"

"అదే సూత్తున్నడా. పేసీ బొత్తే ఎట్ట సగాబ్బా-?"

"ఎహా ఏం పేసీ రాదులే. ఒక్కపూట - అంటాట్టో యిట్టాటి సమయంలో-ఎల్లి అడిగరా మీ అయ్యనీ! మీ అయ్య మంచోళ్ళేరా నాకు తెల్సు."

"ఏం మంచో నాకు తెలవటంలా-"

"సక్కగా మా జేజి వాళ్ళో పొందుకుని, తెల్లార్లూ బొమ్మలాట సూత్తా" అంటున్నది సీతాయి.

"ఆఁ, సూశావులే" అన్నాడు సూరాయి.

"రావణాయుద్ధం సెబతాడంట నాంచారయ్య! అబ్బ! నువ్వు తొగాల్సిందేనంట! నాంచారయ్య అప్పుడు కేతిగాణ్ణి పట్టే కసుప్పుబ్బిపోవాల్సిందేనంట! నాంచారయ్య పెళ్లాం బంగారక్క పాటలు బహు యిసురుగా పాడుద్దంట! సెన్నా పట్నందాకా మోత ఎట్టిందంట నాంచారయ్య బొమ్మలాటం టే-" అనుకుంటున్నది సీతాయ్.

"ఇదిగో సీతాయో -" అన్నాడు సూరాయ్ కాకబుట్టి.
"ఓరి పోరా; నీకన్న ఆకొండాయోళ్ళే నయం" అంది సీతాయి.

"యిదిగో! ఇయ్యాల అరఅర బెమ్మదేవుడు అద్దాం ఒచ్చి నిలబడ్డాచరే, యీ నక్కా సూరాయి బూసి సత్రం కాడ, రావిస్సెట్టు ఇనకాడ, ఏపస్సెట్టు వాలుకొమ్మమీన కూకోని, నాంచారయ్య బొమ్మలాటగనక సూడకనేపోతే - హా రాధణా! -" అంటా గిరుక్కున సెక్రం దిరిగినట్టు తిరిగి బయ్‌మంటా యింటిప్పు లగెత్తుకెళ్లాడు సూరాయి; సీతాయి అటనే నోరు దెరుసుకు సూత్తుంటే.

ఆమయిన యియ్యాల బొమ్మలాట యవారం ఏసాపైసా తేలవాల్సిందేననుకుంటా వుసిమీన ఇంటికాడిదాకా వచ్చిన సూరాయి యింటిముంగల అరుగ్గాడ అటనే జారిపొయ్యాడు, అంతరిచ్చాన దారం తెగిన గాలిపటానికిమల్లె.

ఇంట్లో అయ్య వుండాడు. అమ్మా, అయ్యా ఏందో జోరుమీన మాట్టాడ్తుండారు. ఇగ అటనే అరుగుమొత్తాకాడ సీకట్లో నక్కాడు సూరాయి.

"ఏందయ్యోవ్ పెట్టెలోంచి ఎర్రకండవా తీస్తుండావ్ ?" అంటుండది అమ్మ.

"తీత్తే తీశాన్లేం నువాడ కూకో. పోదీ నీకు కావాల్సిందే నెట్టా ?" అంటుండాడయ్య.

"పోదీ ఎవురిగ్గావాలా ? రేత్తిరిపూట పెట్టెలోవుండ ఎర్రకండవాతో ఏం పనొచ్చిందా అ సరిగా, తప్పెట్టా ?" అంది అమ్మ.

"ఎవ్వు డన్నాడు తప్పనీ. మారగమ్మకమ్మ్లో ఆ దేగ్గో మూలల కూకుండా వనుకుంటే అప్పుడే తగులెట్టుంటివి. పూరాకనే పెట్టిలో వుంటే ఏసుకుంటుండా. కొనుక్కొ తెచ్చుకుండాని ఏసుకుంటానికి కాదెట్టా ?" అన్నాడు అయ్య.

"ఏసుకుంటే ఎవురికేం బట్టిందీ. ఇన్నాలసించి పెట్టిలో పూరకనే వుండదిగా. ఈ రేత్తిరేం పనొచ్చిందీ ?" అంది అమ్మ.

"బువదిన్నాక ఎంకయ్య ఓపాలి రామంటే ఎల్తుండాలే— సానా పనుండది – నువ్వూరికే బురదమట్టి ఎగిరిన స్టైగరమాక" అన్నాడు అయ్య.

"బురదమట్టి గిరదమట్టి అనమాక. అయితే ఎంకయ్య ఎర్రకండవా ఏసుకునిగాని రావద్దన్నా డెట్టా ?" అంది అమ్మ.

"ఏహె రమ్మన్లేదులే, రేక్కుంప తగుల్కుండట్టు తగుల్కుండావు. పెట్టెలో సెదపురుగేమన్నా సేరిందేమోనని సూసి, పానీగండా అని పూరకనే కండవా ఏసుకుంటే రాగం మొదలు బెట్టావే యిడవకుండా!" అన్నాడు అయ్య.

"ఆహాఁ, అట్టనా ! అయితే కూసేపుండు. నా ఆకుపచ్చ కోకగూడ సెదలేమన్నా పట్టెనయ్యేమో సూడనీ—"

"సెదలేం పట్టలేదుగానీ ఇపుడు సీకోకలు గీకలేం తియ్యి మాకి-అహఁ-అదేందీ పచ్చకోక కట్టుకుంటుండవ్ ?" అంటు న్నాడు అయ్య.

"వూరకనే కట్టుకుంటుండాలే. కోకలు కొనుక్కుండది కట్టుకుంటానికిగాదెట్టా? వుండట్టా-" అంటున్నది అమ్మ.

"ఇదిగో - అదేందీ తలగూడ దువ్వద్దే - ఇదిగో సందమ్మాన్ నీ యవారం !" అంటున్నాడు అయ్య.

"యవారమా? సెబుతాలే పద-"

"ఇదేంది-యాడకి అంటుంగో తావు సెలుపుకాడికే?" అంటుండాడు అయ్య.

"ఎంకయ్యకాడ నాకుం పనుంది. ఎంగ్గాంపదా" అంది అమ్మ.

"ఎంకయ్యా ! ఎంకయ్య ఎవ్వరూ ? అయితే ఎంకయ్యని అట్టుంచు. ఇదిగో నమ్మాన్ నువు బొమ్మలాట గిమ్మలాటకని పచ్చకోకగట్టి బయలెల్తుండావుగావాల మరదేందో-" అన్నాడు అయ్య.

"ఎంకయ్య ఎవు రంటంకాడికొచ్చిందీ ? అయితే ఎర్ర కండవా ఏసింది బొమ్మలాటకాడికా అయ్యా? హుఁ అంత దొంగసాటుగా ఎల్లాల్సొచ్చిందా అయ్యా! నాకు తెలవదను కుండా నీ ఏసిగాలుఁ-వుండు తెల్లార్లెగుస్తే మావూరు మాఅమ్మ అయ్యకాడి కెల్లకబోతే సూడు. ఎల్లకబోతే నాపేరు దురగమ్మ కాదనాల్సిందే. ఎంతన్నాయం ! ఎంతమాయా ! అన్నీ దొంగ మాటలే, అంతా బూటకమే ! మాయమ్మా, మా అయ్యోగనక వుంటే ఈ మడిసి ఇట్టా జేత్తాడా - హుఁహూఁ - అమ్మాఁ!"

"దురగమ్మ తల్లి యాదవమాకే నీకు దణ్ణంపెడతా, బుద్ది గడ్డితొంది లేవే -"

"వుంటా - సన్నంటుకోమాకా - అమ్మా -"

"పెద్దగా అరవమాకే తల్లా - యీ సూరాయున్నా వొత్తే బాగుండు. యదవ రాజేం ఏ యాలకూ - బొమ్మలాట కెల్లాం యిగస్తూకోవే -"

"ఏం అక్కల్లా. నువే ఎల్లు ఎర్రకండవాడా, సూరాయి, నేనూ ఎల్తాతే నీకేం."

"అహాఁ, అదుగంటాకే - ఎదవ పనేజేశా - యీనో గజ్జెల సప్పుడవుతొంది - యీ సూరాయివొత్తే బాగుండు. దబ్బున బొమ్మలాట కెల్లొచ్చు - పాటలు యినొస్తుండయి మొదలుబెట్టలేదుగంచా - ఎవ్వరాడా - సూరాయ్ ! ఏందిరా తెలకాయి గోసికొట్టి అట్ట సూస్తొండావూ - చా యదవా - దబ్బున రామంటుంటే - ఎంకటబ్బుచ్చియ్యగోరింటో సెప్పొచ్చా వంట్రా ?"

"మరే - ఆకు అలెత్తేనీ-" అన్నాడు సూరాయి లోన కొచ్చి అటనే గోడకానుకొని యీపు రుద్దుకుంటా.

"చా యదవా-" అంటున్నాడు అయ్య.

"ఆడిమీదికి లెగవమాక వుత్తపున్నానికి - యీ ముండదిరా నీ గళ్ళసొక్కాయా - ఎల్లి ఏసుకోవేంచిరా?" అంది అమ్మ కళ్ళు ఆడిస్తా.

"ఆ పెట్టెలోవుంది ఏసుకోవేరా బాబ్బునా?" అన్నాడు అయ్య.

ఆమయిన బయల్దేర్దంబయల్దేర్దం దాగ్లో అమ్మా అయ్యల్ని సందుసూసుకుని సల్లగా దాటేసి, బొమ్మలాట పందిరికి అసంట ఆల్లు జేరికాడ కూకుని అటేటు నిక్కినిక్కి జూత్తుండ సీతాయి జడతోక ఎనకామాటే ఎల్లి గబిక్కిన ఓగుంజుగుంజి, సెక్కలు, చీనాకేసడబ్బాలు దగ్గనామంటా కేకేగాడు, బంగా రక్కి తెరమీనకు వొచ్చేయాలని; యూపసెట్టుమీన కూకుండ కొండాయి ముటాసు ఎడాపెడా తోసుకుంటూ ఎల్లి సెట్టు మయాన వాలుకొమ్మమీన కూకుండాడు సూరాయి.



# తా సు పా షం

ఈశికులపాడు వూ రెలుపల గెడకర్రలకిమల్లే కిక్కిరిసి నిలబడుండ తాడితోపుమయాన నాగుమల్లె సువ్వకిమల్లె పాంపుట్టలకాడ పాకతుండ బసవాయిని గొడ్లమందకాడ పేడ కొచ్చిన ఎంకాయి దూరాన్నుంచి సూసుద్ది.

ఆ బసవాయి గిరజాలు అప్పుడే తెలుస్తయి. ఆడి మెళ్ళో ఎంజికంటె పదామడ దూరాన్నుండా తెలుస్తానే వుంటది. గెట్టిగా పంచెగట్టి నడుంగు ఆవపాన కట్టు బిగించేది వాడే వాడి మొగ్గానకు అటుపు గెడ్డలు, రెండుసన్లకుపిచ్చలు వేళ్ళాడేదికూడా ఎంకాయికి బాగా తెల్సు.

అయితే యీడకూకుండ ఎంకాయికి ఆడ పాంపుట్టల కాడ తచ్చాడ్తున్న బసవాయి అస లేం చేస్తుండనీ తెలవటం బహుకష్టం. అయినా ఎప్పుడు సూసినా ఏ ఎండ్రకాయ బొక్కలకాడో గెడ్డలుతీసుకుని నిలబడ్డావుండేవోడు. యియ్యాల వుండట్టుండి సాయసాట్న ఆ పాంపుట్టలకాడ తిరగాల్సొచ్చిన పనేంది? ఆడ జనం ఎవరూ లేరుగందా? ఎంకాయి మదనపడ్డది.

గొడ్డమంద వెనుపులెంట, నీలగుంటకాడ ఆటిదార్ని అవి తలలూంచుకుని తిరుగుతుంటే మంద పిల్లకాయలు బిల్లం గోడు ఆడుకుంటావుండారు. అటేటు సూసి తోపులోక సల్లంగా జారబడ్డది పేడపల్లికతో ఎంకాయి.

అంత పట్టపగలయినా తాడితోపులోకి ఎల్లేతలికి గలగల మంటూ దెగ్గిరదెగ్గిరగా వాలేసుకుండ ఆ తాడిసెట్ల సీడలు బూమ్మీనపడి కరవొచ్చే జడల దెయ్యాలకిమల్లె వుంటం అటుంచి ఏ బొక్కల్లోంచి ఎసువంటి జీవాలు తొంగిసూత్తా వుంటయ్యో ఎసువంటి మడిసికయినా తెలవటం బహుకష్టం.

అడుగులు జారకుండా, చుట్టుపక్కల భద్రంగా సూసుకుంటావొచ్చి బసవాయికి కొత్త ఎనకన నిలబడ్డది ఎంకాయి. ఆడ బసవాయి వాలకం, అసలు ఆడేంచేత్తుండదీ మూగలయితే ఎంకాయికి అంతుబట్టలా. ఓ సేతిలో చెంబోళ్ళ పాంకర్రా, రెండోసేతిలో గొబ్బిరిసిప్పా పట్టుకుని కోటయకొండపెబకు మళ్ళేవుండ ఆ పుట్టపక్కన మోకాళ్ళమీన వొంగి నిక్కినూత్తుండ బసవాయిని చూసి కూసేపు అటనే నోరుదెరిసింది ఎంకాయి.

మొదలు ఎవురన్నా మాటలమయాన పాము లంటుంటేనే వొళ్ళుగగిరిపొడుసుద్ది! అసువంటిది అసలవి నిజంగానే పొండుకునే అంతలావు పుట్టా, అన్ని బొక్కలకాడ - ఎచ్చగా లోనుంచి ఆవిరికొడ్తుంటే - ఏ మడిసయినా ఆనజాన ఆడ వొంగి తొంగి సూత్తుంటం ఏ ఆడకూతురుకయినా ఎట్టుంటదీ ?

"ఓరేయ్ !-" అని గుటకమింగింది ఎంకాయి.

నిశిరేత్రి, నిదర్లో ఎవురయినా ఏడు సముంద్రాలు దాటి, మూడడవుల్ని ఏటుకునరికి, కుప్పేసి, నాలుగోఅడివి మయానుండ మర్రిసెట్టు తొర్రకాడ నిలబడి అరవకుండా తొంగి సూత్తుండే యవదానంలో - గబిక్కన యీపుమీన పెటీమని సరిచి సిటారుగా కూకోబెట్టి సదల్లేప్తే ఎట్టుంటదో అట్టయి

పోయి – గబిక్కి న ఎనిక్క ఒక్క గెంతేసి నిలబడి ఎంకాయిని సూశాడు బసవాయి.

"ఆఁయ్–!" అన్నాడు బసవాయి నోరుతెరిసి.

పళ్ళిక నెత్తినబెట్టుకుని, కోక పైకెగ్గట్టి, ఆవజాన నోరు దెరుసుకు సూత్తుండ ఆమడిసి గంగానమ్మతల్లనుకుండ బసవాయికి యింకూ స్నేపటికిగాని ఎంకాయి ఎంకాయికిమల్లే అగుపించలా.

మొన్నిమజ్జె బెచ్చాలాళ్లో తేలుకొండె జనంలో ఎర్రెన్న ఎంకాయి, వుండబ్బుండి కోకెగ్గట్టి ఆవజాన ఆడ నిలబడేతలికి శానబిగిసి గుటకమింగాడు బసవాయి.

"ఒరేయ్ !" మళ్ళీ అంది ఎంకాయి.

"ఆఁ ?" అన్నాడు మొకంతిరగని బసవాయి.

"ఏందిరా నువ్వుసేత్తుండదీ ?" అడిగింది ఎంకాయి.

"ఎవ్వురూ – నేనా ? – అయితే ఏంలే –" అంటున్నాడు బసవాయి.

"అయితే ఏంలే అటాడేం ! –" అంది ఎంకాయి.

"కాత్తె పనిమీానుండాలే –" అన్నాడు బసవాయి.

"అబ్బో కాత్తె సెప్పగూడట్టా ఆ పనేందో ?" అంది ఎంకాయి.

"ఆఁ, అదే అనుకుంటుండా –" అన్నాడు బసవాయి.

"అబ్బో మాటలు నేర్చావే నాయనా ! యాడకి పోయినావయ్యా యిన్నాలమించీ ?" అంది ఎంకాయి.

"ఎటో పోయినాలే –"

"చరే, యిగనేం–" పళ్లికకిందపడేసి కూకుండదిఎంకాయి.

"నీకో నా కెందుకొచ్చింది, యివకాడ సానాపనుం డది నాకు," అన్నాడు బసవాయి, ఏం పట్టించుకోనట్టు పుట్ట కాడ తిరుగుతూ.

"ఎవురొద్దన్నారూ, వుూటే చేసుకోరాదూ?" అంది ఎంకాయి.

"అసలు నువ్వు యిటు ఏం పనిమీాద వొచ్చినట్టూ?" అన్నాడు బసవాయి పొంబొక్కలోకి తొంగిసూత్తూ.

"ఒరేయ్, ఒరేయ్ ఏందిరా నువ్వాడ తొంగిసూసేదీ," అంది ఎంకాయి వుండబట్టలేక.

"పాముల్లే-" అన్నాడు బసవాయి అటనే తొంగిసూత్తూ.

"పాముసీ! ఎందుకురా పామును తొంగిసూట్టం? అవి మంచివి కాదంటరా!" అంది ఎంకాయి.

"పనివుందిలే," అన్నాడు బసవాయి.

"ఏం పనిరా, కాత్తె సెప్పవంట్రా!" అంది ఎంకాయి.

"పామును పట్టుకుందామన్నాలే" అన్నాడు బసవాయి.

"ఆఁ, నిజంగానట్రా! పోరా నీ బడాయిలు నాకా డంట్రా! నీలాంటోళ్లు యింకా పదిజనములెత్తాల పామును పట్టుకుంటానికి" అంది ఎంకాయి.

"బడాయిలా? చూస్తావా, మరీ పడ్తానో లేదో? హుఁ! యీా బసవాయంటే అంతే ననుకుండావుగావాల్ను."

"యిగ చాల్లే యివకాడికి రారా, పెద్ద పామును బట్టే మొగోడివి నేటిగ్గాంగాబయల్దేరావుగ నీ. సానాసూశాం యిట్టా టోళ్ళని. ఒరేయ్ ఎండ్రకాయలు పట్టుకోక ఎందుకొచ్చిం దిరా నీ కాపనీ?" అంది ఎంకాయి.

"నువ్వు సూశావా నే నెంౘ్రడకాయలు పట్టటం?"

"సూశానా యింగా సూశానా? హుఁ! నాకు తెల వకపోద్దగా నీ సంగతీ?" అంది ఎంకాయి.

"ఏందమ్మో నీకు సెల్పిందీ? శాపలుఁగదూ నేను పట్టు కునేదీ? శావాలంటే ఎల్లి అడుగు ఎవుర్నయినా."

"ఒరేయ్, సిన్నప్పుడు నువు ఎంౘ్రడకాయల్ని పద్దాకా గెడ్డలుఁదీసుకుని కొట్టేసేవోడివి గావంట్రా?" అంది ఎంకాయి.

"సిన్నప్పుడు నీకు తేలుఁకొండెకిమల్లే జడ వుండేదంటనే యిప్పుడది యాడకి పోయిందమ్మా?"

"ఓ బసవాయోవ్, నా చంగ సెరగవు శెల్పిందా?"

"మరి యింకేం! అటనే అనుకోరాదూ నేనుశూడా. హుఁ! అంతలావు ఎగతాళిగా వుండనిగా!"

"అబ్బో మాటలు సానా నేర్సావే!"

"హుఁ! ఆడ నీకే మాటలొచ్చింది. నీ కన్న యీడ ఎవురేం తక్కువతిన్నా— నాతో నీకె దూకొచ్చిందిగానీ యివ కాడ సానాపనుండది నన్ను పలకరిచ్చమాక" అని మళ్లీ పాం బొక్కల్లోకి తొంగిసూత్తుండాడు బసవాయి.

"ఒరేయ్, ఒరేయ్ బసవాయ్?"

"ఏం?"

"ఎందుకురా నీకు పాములజోలీ? అవి ఎసువంటివో నీకు తెల్సా?" అంది ఎంకాయి.

"హుఁ! యీ బసవాయికి అన్నీ తెల్సు, యియ్యాల వైద్దికంలోకి గరగళం తెచ్చిత్తే అద్దరూపాయి డబ్బులిత్తా నన్నాడు రాంబెమ్మయ్య" అన్నాడు బసవాయి.

"గరగళం! గరగళం ఏందిరా?"

"తాచుపాం గరగళం" అన్నాడు బసవాయి.

"తాసుపాం యిసమంట్రా! ఓమ్మో, అందుకంట్రా యీాడ నువ్వు తిరుగుతుండదీ?"

"బలేతాసుపాములుండయిలే ఈడ!" అన్నాడుబసవాయి.

"గెట్టిగా అరవమాకరా! నీకు నిజంగా శాతవునంట్రా ఆట్ని పట్టటం?"

"హుం! అదొక లెక్కా-జమా! మా అయ్యోళ్ళు ఆట్ని మిడతల్ని పట్టుకున్నట్టు పట్టుకుని, నడిబజార్లో ఆట్ని మెళ్ళల్లో కట్టుకుని తిరిగేవాళ్ళు!" అన్నాడు బసవాయి.

"ఆళ్ళు పెద్దోళ్ళురా! ఆళ్లు ఏం చేసినా చెల్లుద్ది! ఆళ్ళ కాడ మంత్రకల్లుండేదంట!"

"అంతావుత్తది. వుత్తధైర్నంమీాద పట్టాల్సిందే ఎవురు పట్టినా" అన్నాడు బసవాయి.

"నీకు ధైర్నం వుండదంట్రా?"

"ఎవరికి___నాకా? వుండో లేదో యిప్పుడు తెలుసుద్దిగా" అన్నాడు బసవాయి.

"అద్దరూపాయి డబ్బులంట్రా రాంబెమ్మయ్య యిచ్చేదీ?" అంది ఎంకాయి.

"ఆకు అంతకన్నా యిచ్చిసావదు. సచ్చినోడి పెళ్ళికి వొచ్చిందేసాలు."

"పాసంకన్నా తీపంట్రా అద్దరూపాయీా? అసలు తాసుపాం ఎంత సెండాలపుదో నీకు తెల్సా? రాంబెమ్మయ్య నిన్ను మాయసేత్తుండాడ్రా" అంది ఎంకాయి.

"ఇదిగో ఎంకాయోవ్, అర్ధరూపాయిలో నీకుపావలా బిళ్ళయిత్తా" అన్నాడు బసవాయి.

"నీ పాడూ – నాకేం అక్కర్లే ఎదవ డబ్బు–"

"నువ్వు సిన్నప్పుడు ఓనాడు మనం కోతికొమ్మచ్చాట ఆడుకుని యింటికి తిరిగొత్తావుంటే సింతలతోపు కాడ నన్ను సాటుగా సిలిసి ఓ పావలాబిళ్ళ సంపాయించుకురామంటివే!" అన్నాడు బసవాయి.

"అప్పుడంట్రా! పోరా నీ దుంతా! అప్పుడు సెంచయ్య కొట్టోకి సబ్బిళ్ళకెళ్తేనీ – అకేప్పిత్తిందిరా – నీ పాడూ! అదెప్పుడో సిన్నప్పుడురా. ఇప్పుడు సబ్బిళ్ళ గిగ్గరకుంటే మానేది సంపుద్ది" అంది ఎంకాయి.

"అప్పట్నుంచీ ఎప్పుడిత్తామనుకుండా ఓపావలా బిళ్ళన్నా సిక్కకుండాపుందే ఎంకాయ్" అన్నాడు బసవాయి.

"పోనీ లేరా ఎదవ పావలాబిళ్ళా–"

"ఆఁ, అంతేనా! డబ్బంటే అంగసులకనగా తోసెయ్యమాకేవ్. యిమ్యాల బెమ్మదేవుడు దిగొచ్చినాచరే ఆ రాంబెమ్మయ్య దెగ్గిర్నుంచి అర్ధరూపాయిబిళ్ళ రావాల్సిందే, నువ్వు మాట్టాడమాక–అటూ పాంకర్రా, కొబ్బరిపిప్ప గట్టిగా పట్టుకుని పాంపుట్టకాడ కూకుండాడు బసవాయి.

"బసవాయ్!" పిలిసింది ఎంకాయి.

పాంకర్ర వూత్తా నాగస్వరంపాట మైకంలో పడ్డాడు బసవాయి.

యాడా సలీ సప్పుడు లేదు. దూరాన గొడ్డపిల్ల

కాయలు బిల్లంగోడు కొట్టుకుంటూనే వుండారు. నాగస్వరానికి నిలబడి ఆడ్తుండ తాసుపాములకిమల్లే నిటారుగా నిలబడుండ తాడిసెట్లు గాలికిసల్లగా అటిటు కదులాడ్తుండయి.

బసవాయి మాట యినిపించుకునేట్టులేడు. యీడికి యిమ్యాల యిట్టా బుట్టిందేం? యీడు సిన్నప్పుడే నయం. కోతి కొజ్జిల్లాట బలే ఆడేవోడు. ఎదవసచ్చినోడు ఒక్కపాలన్నా నన్నుదొంగను సేసేవోడుకాదు. మాలావు నాకేనెట్టా ఆ మాత్రం ఆట శాతకాందీ? ఆ పిచ్చాయోళ్లు బసవాయి నన్నొ దొంగని సెయమని ఒకటేమయిన ఏడ్చేవోళ్లు! సీ పాడూ! ఆళ్ల దెప్పుడూ యెదవ బుద్దేగందా! యిగ యిప్పుడేం వుండదీ? బసవాయి ఆటల్లో కలవటమే మానేశాడు. ఎప్పుడు సూసినా ఏ డొంక మలుపుల్లోనో తిరుగుతావుంటాడు. యీ మద్దె యీడికి మడుసులంటేనే పట్టంలా. మడుసు లేం కరుత్తారా దెగ్గిరకొత్తే? పావలాబిల్ల యింకా గాపకం పెట్టుకుండాడే! ఎవురికేం అక్కర్లా - ఆ దిత్తానన్నా అక్కర్లా. సీ - డబ్బు లడగడమేంది పాడూ! అప్పుడెప్పుడో అడుగుతే యింకా గాపకంపెట్టుకుండాడే! నామీద ఆడికి నిజంగా గురి వుండదా? ఏంపాడో...యీడికేవన్నా గాలి పట్టలేదుగందా? రాంబెమ్మయ్య అద్దరూపాయి డబ్బులకి తాసుపాంని పట్టుకుని యిసం సిందుతాడంట! యీడి అయ్యోళ్ళుకూడా యింతే నంట. యింకేం యీడూ తయారయ్యాడూ! అద్దరూపాయ్! ఆడన్నట్టు అద్దరూపాయంటే మాటలా! ఆ అద్దరూపాయింటే ఏంకొన్నా కొనచ్చు - అయితేమట్టుకూ! పాములన్నా పడ్తా నంటం? పెమాదంగాదూ? ఒక్కోపాలి- సీ అనగూడదుగానీ-

పానాలుగూడా పోతయి...అసలవి మనుషులుండేసోటికి అంత సులబంగా రావంటనే? యీడెంత పాంకౖర వూదుకున్నా అవి రాకుంటేసరి. అసలా పుట్టలో పాముండదో లేదో. ఉంటే యింతసేపు రాకుండా వుంటదా? ఒకవేళ అది బయిటికొస్తే యీడికి దాన్ని పట్టడం సరీగా తెలీకపోతే? యింకా ఏమన్నా వుండదీ – "ఒరేయ్ బసవాయ్ యిక సాల్లే రారా!" అంది ఎంకాయి.

బసవాయి ఎప్పుడో నాగలోకానికిపొయ్యాడు. ఎంకాయి యీడ కూకుండదని ఆడికి అసలు తెలవదు. పాంకౖర వూత్తా అటనే వూగుతుంటాడు బసవాయి.

ఎంకాయి కళ్ళు మెరిసినై – ఒక్కపాలి ఎనిక్కి ఝలుకు సుకుపడ్డది ఎంకాయి. పుట్టలోంచి తలతలతల మెరుస్తా జలజల జారి దోసెడు పడగిప్పుకుని బసవాయిముంగల శోకమీన నిలబడి వూగుతూ ఆస్తోడదా తాసుపాం! అటనే నేలకు నీలుక్కపోయింది ఎంకాయి.

నిశిరేత్రి మెరుమ్మెరిసి దామ్మని సిడుగుపడ్డట్టు–తాసుపాం తనముంగల నిలబట్టం సూశాడు బసవాయి. పాంకౖరవూత్తానే– ఒక్కపాలి కళ్ళు మూసుకుండాడు బసవాయి. బసవాయి గుడ్డల్లో ముళ్ళు పొడిసినట్టు సూసింది తాసుపాం. ఒల్లు తడిసింది బసవాయికి. మెడతిప్పి ఎనిక్కితిరిగి సూశాడు – యిగ్గ పానికిమల్లే నీలుక్కబోయి గుక్కిప్పుకుని సూత్తుండది ఎంకాయి. మెడ బిగిసింది బసవాయికి.

సల్లగా సెయి ఒనుకుతా – పాంకౖర తాసుపాం పడిగ మీనకి బోనిత్తుండ బసవాయికి మద్దెలో నరాలు పటపట

బిగలాగటాన పట్టుదప్పి ఎనిక్కి తూలిన తూట్టం ఎగ్గిరెగ్గిసి గెంతేసి వుసిమీాన ఎల్లి ఎంకాయి సెయి పట్టుకొని తాడితోపు లోంచి బెయిటికి అదేమయిన లగెత్తాడు.

"యదవ సచ్చినోడా - పానం తీశావుగదంట్రా - యిడూ సెయి-" అంది ఎంకాయి రొప్పుతూ.

"అరవమాకే-" అన్నాడు బసవాయి తాడితోపు కల్లి బిత్తెరి సూపులు సూత్తా.

"సెపితే యిన్నావంట్రా. ఒరేయ్ ఎండ్రకాయలు పట్టుకోక ఎందుకొచ్చిందిరా నీ కీపని -" అంది ఎంకాయి టపీమని కళ్లాపి గొట్టినట్టు.

* * *

ఆయాట్టినుంచి బసవాయి ఎంటపడింది తాచుపాం. పులిస్తరాకు లెగుస్తే తాసుపాం లెగుస్తున్నట్టుంటున్నది బసవాయికి. ఎవురన్నా గబగబ మాట్టాడుకుంటుంటే బసవాయి ఎంటికలు నిక్కబొడుసుకుంటుండై. సూర్లో తాడు, రోడ్డు మయాన, రోడ్డుపక్క తాళ్ళనుసూసి ఎనిక్కి ఎగ్గిరి గెంతేసి యీాపు సరుసుకుంటుండాడు బసవాయి. కలలుకన్నాడు బసవాయి. గోడ మిత్తలకాడ, గుడిసె సూరుసందుల్లో, శాంతాడుసుట్ట మయాన తెననుసూసి తాసుపాం 'బస్సు' మంటా పడిగ ఎనక్కితీసుకోటం ఎన్నోసార్లు కళ్లోసూశాడు బసవాయి. తమాసా! ఓ సిశిరేత్రి ఎంకాయి తాసుపాముకు మల్లే 'బుస్సు' మంటం సూశాడు బసవాయి.

కొన్నాలకి ఓనాడు సందేల గొడ్డమందతో యింటికి తిరిగొత్తా తాడితోపులో ఆ పుట్టకాడ గెడకర్రకిమల్లే తాడి

సెల్లలో కలిసిపోతా ఎవుళ్ళో నిలబడుంటం మసగ్గా సూసింది ఎంకాయి. ఒక్కపాలిగా నిలిసిపోయింది ఎంకాయి. ముందుకుపోను ఎంకాయికి కాలాడలా. సల్లగా మందనించి ఎనిక్కెనిక్కె తగ్గి తాడిశోపుకాడి కొచ్చి సూసింది ఎంకాయి. నిజంగా ఆ పుట్టకాడ ఓ మడిసి నిలబడుండాడు. బసవాయి కాదు గందా! యిదేంది యీడికేవన్నా గాలిబట్టిందా? యీ యేలప్పుడు ఒంటరిగా ఆడ నిలబట్టానికి ఎంత దైర్నం ఉండాల?

మసగలో తడువుకుంటా పుట్టకాడికొచ్చి – ఒక్క పాలి కేక బెట్టి అటనే నోరుదెరిసి కొయ్యాకిమల్లే నిలబడిపోయింది ఎంకాయి.

ఆ తాసుపాం బసవాయి మెడా, సెయీ బిగదీస్తుంటే, దాని మెడకాడ పట్టుకుని గొబ్బరి సిప్పలోకి దాని యిసం పిండుతుండాడు బసవాయి!

దైర్నంగల మొగోడు గుండెబిగువుమీన దెబ్బయి గెజాల ఎత్తయిన దొజత్తంబాంమీనకు ఒక్కక్కజనగే జనుకుల్టా ఎల్తుండే యవదానంలో ఒకాండగూతురు గుండె బెదిరి ఒక్క పాలి కేక పెట్టేతలికి అంత దైర్నంగల మొగోడిగుండె బిగువు కుండ పగిల్నట్టు పగిలి, నరాల పట్టుతప్పి సెపటలు గక్కులా గిరగిర తిరుగుతా దెబ్బకు బూమ్మీన పడాల్సినదన్నమాట!

గబిక్కన ఎనక్కితిరిగి సూశాడు బసవాయి వూపిరి బిగబట్టి.

"ఎళ్ళు –" అన్నాడు బసవాయి దవడలు కరుసుకుంటా.

"ఒమ్మో –" మూలిగింది ఎంకాయి.

పొట్టలిచ్చిన పత్తికాయలకిమల్లే ఎంకాయికళ్ళు బసవాయి గుండెలమీాన దిగినై.

"ఎల్లిపో - మళ్ళీ ఎందుకొచ్చా యీాడకి? నాసయి జాస్తుండది - ఎల్లిపో అరవకుండా - "

"అరవన్లేరా - ఒరేయ్ - ఒరేయ్ - నిన్ను సంపుద్దిరా - దాన్ని సంపరా - " మూలిగింది ఎంకాయి.

తాసుపాంకల్లి సూశాడు బసవాయి. తాసుపాం రఖతం గక్కుతా పటపట గొబ్బరిసిప్పను కొరుకుతా వొనుకు తుండ సెయి సుట్టూ మెల్దిరుగుతుంటే - ఒక్కపాలి గెట్టిగా నరాలు బిగబట్టి, ఎంకాయికల్లి కొరకొరసూత్తా సువ్వాకమల్లే మెల్దిరిగి వుసిమీాన తాడిసెట్ల సీకట్లోకి గబగబా లగెత్తు కెల్లాడు బసవాయి.

మరుస నాట్నుంచి జరంలో మతెుండక మంచంలో పడుండాడు బసవాయి. "వాడికేం రాయిలాంటి మనిషి." బసవాయికేం ఫరవాలేదన్నాడు ఎంకాయితో వైద్దికుడు రాంబెమ్మయ్య.

కొన్నాళ్లు గడిసినాక ముగ్గురు బిడ్డలత్తో పుట్టింటికి తిరిగొచ్చిన ఎంకాయిని తాడితోపుసాయల్ల "ఏం ఎంకాయమ్మోవ్!" అని బసవాయి పలకరించేదాకా బసవాయిని ఎంకాయి పోల్చుకో లేకపోతోంది.

"సంపావు గదంటయ్యా బసవయ్యా! పోల్సుకోనే లేకబోతినే నా తెలివి పాడుగానూ! బాగుండావంటయ్యా! బొత్తిగా గురుతు పట్టకపోతినే!" అంటూ బసవాయిని యిశారించింది ఎంకాయి.

"చరే, పెద్దోణ్ణయిపోటంలా! నీకు ముగ్గురు బిడ్డలంటగా, బాగుండారా?" అన్నాడు బసవాయి.

"ఆఁ, బాగుండారయ్యా బసవయ్యా. పెద్దోడిపేరు ఆళ్ల తాతపేరు పెట్టుకుండారూ, రెండోవాడిపేరు ఎంకటేశ్వర్లు, మూడోదానిపేరు చీతాం." అంది ఎంకాయి.

"నువ్వూ కాత్త పెద్దదానివయినా మడిసివి అంతగా మార్లేదులే" అన్నాడు బసవాయి పక్కకి తిరిగి వుమ్మూస్తా.

"ఏబ్బే, అదేందయ్యా యింగా పెద్దదాన్ని కాలేదం టావు ముగ్గురు బిడ్డలయితేని! యింగానయం! నువ్వు పెద్దోడి వయ్యావు. సానా సన్నబడ్డావు" అంది ఎంకాయి.

"కాత్త మద్దెమద్దె వొల్లు సెత్తావొచ్చిందిలే – సానా ఏళ్లుకాలా మరీ –" అన్నాడు బసవాయి.

"సానా ఏళ్లయింది" అంది ఎంకాయి.

"అంతా నిన్న మొన్న జరిగినట్టుంది," అన్నాడు బస వాయి.

దూరాన గొడ్లు ఆడీడ గెనువులెంట తిరుగుతుంటే గొడ్డపిల్లకాయలు బిల్లంగోడు ఆడుకుంటుండారు.

"బలే బయంబుట్టింది" అంది ఎంకాయి.

"నువ్వు కోక పైకెగ్గట్టుకుని ఎగిగిత్తేవొచ్చి ఆడ నిల బట్టం యింగా కల్లల్లో మెదుల్తుండది," అన్నాడు బసవాయి.

"ఎట్టాపట్టుకుండా ఆ తాసుపామునీ – సివరకి ఏం జేశా దాన్ని? నువ్వామయిన లగెత్తుకు పోయినాక అడలుబుట్టి సచ్చా. యాడజూసినా అగుపించలానువ్వు."

"ఆమూలకిపోయి, దాని యిసంపిండి తల నేలకేసి రుద్దిరుద్ది సంపేశా," అన్నాడు బసవాయి.

"ఓమ్మో!" అనరిసింది ఎంకాయి.

"అదిగో - ఎంకాయోవ్ -"

"బలేబయ్యం పుట్టిందిరా బసవాయ్-"

"సంపేత్తివి గదంటే ఎంకాయ్-"

"అదేంది బసవయ్యా ఎనకటికిమల్లే ఒరే, ఒరే అంటుండానూ - ఛీ, సచ్చిందాన్ని - యిదేంమడిసినీ - యిహి, యిహి -" అంటా ఎంకాయినవ్వుతే బసవాయీ నవ్వాడు "అంటే అన్నావులే" అంటూ.

"సివాకీ రాంబెమ్మయ్య ఆల్చెం అయిపోయిందని గరగళానికి అద్దరూపాయి బిల్లయీాయనే యీాయలేదుగా," అన్నాడు బసవాయి.

"ఆరి యీాడిజిమ్మడా! నిజంగా యీాయనే యీాయలా!" అంది ఎంకాయి.

"అచ్చె నీకోడు యీాయనే యీాయలేదుగా! యిత్తే నీకు పావలాబిల్ల ఎప్పుడో యీాయక బోయ్యేవాణ్ణా!" అన్నాడు బసవాయి.

"అదేంది బసవయ్యా యింగా పావలా బిల్లంటుండావూ-!"

"అంటే ఏంలే. మాటన్నాక యీాయకనే బోతినిగా."

"పోనీలే బసవయ్యా - అందరూ బాగుంటే అంతే సాలు."

"అంతేలే ఎప్పటికయినా-" అన్నాడు పక్కకు తిరిగి వుమ్మూస్తా.

"మా పిల్లల్ని సూశావంటయ్యా బసవయ్యా!"

"ఏదీ నువ్వు నూపియ్యక నే బోతివిగా."

"బలేవోడివిలే ! ఆనక మాయింటికొ స్తే తప్పేట్టా!" అంది ఎంకాయి నవ్వుతా.

"ఓ బసవయ్యోవ్, ఓ ఎంకాయమ్మోవ్ కొత్త ఓ పాలియిటొచ్చి పొండయ్యా మీ మడుసులు బంగారంగానూ!" అని ఒక్క పాలరిశారు పిల్లగోడుకాడ తగువొచ్చిన గొడ్ల పిల్లకాయలు.



# వెంకటస్వామి పాలెం

ఎవురో యీపుమీన పెటీమని సరిచినట్టు వులిక్కిబడి గబిక్కిన లెగిసి కూకుండాడు వెంకటస్వామి.

ఇంకా సెన్నపట్టంనుండి కలకత్తాకిబోయే తుర్మేలుబండి రాకతలికే — అంటే మామూలుగా తెల్లారుజామున జనమంతా లెగిసి పనిపాటులు సేసుకోనేయాల యింకా సానాసేపు వుందనంగానే స్లీడరు అనుమంతయ్యగారి ఆఫీసుగది దర్వాజాకు పక్కన మూలగా సాపమీద ముడుసుకు పండుకునుండ అనుమంతయ్యగారింటి పనిపిల్లకాయ ఎంకటస్వామి మామూలు యాలకు ఎతిరేకంగా తెల్లారి మూడుగెంటల యాలప్పుడు ఉండట్టుండి ఆవజాన ఎగ్గిరిపడి లెగిసి కూకుండాడంటే పైనుంచి ఏదయినా బల్లిపిల్ల గల్లిపిల్ల మీనకు దూకయినావుండాల, కాదుగూడ్దంటే ఎలికెపిల్ల బొలికెపిల్లయినా గబిక్కిన గీకి ఎటుగానో లగెత్తుకు పోయున్నా పోయుండాల! అయితే ఆవజాన ఎగ్గిరిపడి లెగిసి బిత్తరసూపులు సూత్తుండ ఎంకటస్వామి ఎనువంటి బల్లిపిల్ల ఎలికపిల్ల జోలికిబోక లెగిసినోడు లెగిసినట్టే గోడకు ఆవజానే కరుసుకుని నిటారుగా కూకుండిపొయ్యాడు.

ఎంకటస్వామి కలగన్నాడు. నిదర్లో కలగన్నోళ్ళు నిదర్లెగిసినాక ఆ కల ఏలా యిశేషాన్ని బట్టి ఎటువంటి సూపులు

సూత్తాకూకున్నా కూకుండొచ్చు. ఎంకటస్వామి యింకా బిత్తరసూపులుసూత్తా గోడకు సిటాయుగా కూకునుండాడు.

ఆవజాన లెగిసీ లెగవంగానే ముంగల తను కలగన్నా ననుకోలా ఎంకటస్వామి. కాని అనుమంతయ్యగారి యింటి జనం యాడపండుకున్నోరు ఆడే సలీసప్పుడు కాకుండా పండుకు నుండేతలికి యిగ తను కలగన్నది కాయమనుకున్నాడు ఎంకట స్వామి.

ఇట్టా కోట్టుకెల్లిన అనుమంతయ్యగారు గబగబ బూసూ సులు, టకటకటక కొట్టుకుంటూ వొచ్చి ఆఫీసు దర్వాజా తలుపు గబాల్న దెరిసి మూలపండుకునుండ తన తలకాడ నిలబడి వొంగి తనకల్లి గుర్రగా సూస్తుండట్టు ఎంత గట్టిగా నయినా కలగన్నాడు ఎంకటస్వామి.

అనుమంతయ్యగారేందో, తనకల్లి అట్ట సూట్టమేందో, తనావజాన ఎగ్గిరిబడి ఎందుకు లెగిశాడో అరదంకాక కాసేపు తికమకబడ్డాడు ఎంకటస్వామి.

ఇంకా యింటోయాడా ఎవుగూ లెగవలేదు. యింటిపని సేసుకునేయాల యింకా సానావుంది. అయినా యిగ నిదరబట్ట లేదు ఎంకటస్వామికి. అటనే గోడకు ఆనుక్కూకుని ఆలోస నలో పడ్డాడు ఎంకటస్వామి.

ఇంతకుముంగల తను ఎన్నో కలలు గన్నాడు ఎంకట స్వామి. తను పాలెంలో అయ్య అమ్మోళ్ళను వొదిలేసి అను మంతయ్యగారితో బస్తీకి మొట్టమొదటసారిగా రావటం, బస్తీలో వెల్తురీదీపాలు, రంగురంగుల అద్దాల దుకాణాలు, గోడలమీద సినిమా పేపర్లు, వందలకొద్ది మడుసుల్లాగే రిక్షా

బళ్ళు, ఎన్నెన్నో గుర్రబళ్ళను తను కలగన్నాడు. ఆమీన తన కెందుకో బస్తీమీన కలలు రావడం తగ్గినై. యీడకి వచ్చిన కొన్నాళ్ళకే తనకి బస్తీమీన మోజు తగ్గుతావొచ్చింది. యింకోనాడు అయ్యా అమ్మాత్తో తనూ రంగన్నా, రామన్నా, సీతక్కా, బూసాం, సుబ్బాం కలిసి వరికోతలికిబోయి ఆడ బూసాం, సుబ్బాం, గెనుములవెంట పిల్లిమిసరకాయలు కోసుకు తింటుండట్టు కలగన్నాడు తను. యింకోపాలి పాలెంలో శివుడి గుడి ము గల ఎన్నెట్లో తను కోటాయి ముటాకో గలిసి బలిగుడు ఆడ్తుంటే మూలచ్చి సప్పుళ్లు సకుస్తూ ఎగుర్తుండట్టు కలగన్నాడు.

అయితే యియ్యాళ తనుగన్న కలకీ, ఎనకటి కలలకీ ఎటుగా సూసినా సంబంధం లేదు. కలలో అనుమంతయ్యగారు ముక్కూ, ముక్కడ్దాలాడిస్తా ఆవజాన సూత్తావుండటం ఒకేదంగా ఎంకట స్వామికి కడుపులో తొలిసినట్టయింది.

ఇయ్యాల కలలో పరీచ్చగా సూసినంతగా అనుమంతయ్య గార్ని యింతకిముంగల సూడలా ఎంకటస్వామి. ఎందుకో అనుమంతయ్యగారు తనవేపు అట్టా సూత్తుంటారు? యీమద్దె అనుమంతయ్యగారు తనవేపు యీవజాన రెండుమూడుసార్లు సూసినట్టు ఎంకటస్వామికి మసగమసగ్గా అగుపించింది.

ఓపాలి తను అనుమంతయ్యగారి బూడూసులు అంతకు ముంగలే పాలీసుచేసి దరవాజాపక్కనబెట్టి, దొడ్లోకెళ్ళి నీల బాయిలేరుకు నిప్పు తగిలించి, సిమింటి తొట్లోకి బాయిలోంచి ముప్పయి కడవల నీలులాగి, నీలతూములకాడ గబ్బుకొత్తుంటే పినాయిలుబోసి కడిగి, సెట్లపాదులకాడ సెత్త సెదారం ఎత్తేసి,

మచ్చుమీాన కట్టెగదింపి పేళ్ళోలిసి, నీలగదిలో జిడ్డుగావుంటే గొబ్బరిపీసుతో రుద్ది, మెట్లగెదికాడ పినాయిలు డబ్బా పెట్టడానికి దర్వాజామలుపు యిట్టదిరుగుతా గబిక్కన పాలీసుచేసిన బూడూసులమీాన సూడక తడికాలువేసి తొక్కాడు తను. నల్లగా నిగనిగమంటుండే బూడూసులమీాన తడికాలు పడేశలికీ ఆ బూడూసులు ఎట్టయిపోయిందీసూసి బిత్తరబోయితను యిట్లా పక్కకి తిరిగిసూత్తే— దర్వాజాపక్కనే నిలబడి తనవేపు, ముకూ, ముక్కద్దాలాడిస్తాయింతగా సూస్తుండాడు అనుమంతయ్యగారు.

ఇంకోపాలి తను పడగ్గదులు, భోజనాలగది, మెట్లుగది, మెట్లగది కడుగుతా, గుడ్డతో నీలుపిండి పారబోస్తా ఆఫీసు గదిలోకొచ్చి కురిజీలు వరండాలోపెట్టా మేజాకాడి కొచ్చేతలికి, అనుమంతయ్యగారి రెండో అబ్బాయి సుందరం బొమ్మల పుత్తకం ఆడ తెరిసిఉంది. అనుమంతయ్యగా రబ్బాయిలు కనకం, సుందరం మేజాముంగల కురిజీల్లో కూకొని రోజూ అదేమయిన పుత్తకాలు సదువుకుంటా, ఆ బొమ్మలు ఈబొమ్మలని నవ్వుకుంటా గిచ్చుకుంటావుంటే తనూ కాత్తెసూద్దామని అయ్యేందో సెప్పమని కనకం, సుందరాల్ని అడిగితే ముంగల కనకం ఎక్కిరిత్తే ఆనక సుందరం ఎక్కిరిచ్చాడు తనని. అటేటు సూసి తను సల్లగా ఆ బొమ్మలపుత్తకాన్ని తీసుకొని కాయితాలు తిప్పుతా రంగురంగుల రవిలుబండి, కోళ్ళు, కొండలు సూత్తా అటనే కురిజీలో కూచుని పొయ్యేతలికి, ఎవురో తన పక్కనొచ్చి నిలబడి నట్టనిపించి, యిట్ట తలెత్తిసూత్తే, అను

మంతయ్యగారు తనవేపు యియాలకలలోకిమల్లే ఆ ముక్క-ద్దాల్తో ఆవజాన ఎటకారంగా చూత్తుండాడు.

నిదర్లో ఆవజాన కలగని లేసి కూకుండ ఎంకటస్వామికి యియన్నీ గెపితికొచ్చేదలికి ఎనకాల యీపుమీన ఏందో వాన పాముకుమల్లే సల్లగా ఎగబాకినట్టయింది.

ఆనాడు అనుమంతయ్యగారు తన పొలాల పనిమీన పాలెంరాటం గెపితికొచ్చింది ఎంకటస్వామికి. అప్పుడు తను అయ్యపక్క-నే వుండాడు. అయ్య అనుమంతయ్యగారికి దణ్ణాలు పెట్టాడు.

"ఏం వెంకయ్యా బాగున్నావా?" అని అయ్యని పలకరిచ్చాడు అనుమంతయ్యగారు ముక్క-ద్దాలు సద్దుకుంటా.

"అదేబాగులే దొరా - అట్టుండాం. మాకు పాపతి లేక పోయిందిగాని తమపొలమే చేసుకుంటా కనిపెట్టుకనుంటే మారోజులు యింత ముదసట్టికంగా వుండేవి కాదేమోనని లోన పీకుతాఉంటది."

"సరే అయిపోయిందానికి యిప్పుడెందుకు వెంకయ్యా, పంట ఆయేడు కాయేడుకు ఎక్కు-వవుతోంటే యింకొకబస్తా కవులు ఎక్కు-వ యివ్వమంటే మరినువ్వు యివ్వకబోతివి. సరే అయిపోయిందిగా," అన్నాడు అనుమంతయ్యగారు.

"పానీ లేదొరా! అదేదో శెనిపట్టింది గనకనే నేంసేసిన కష్టం యింకోరికి కవులు దక్కిందనుకుంటా. సన్నాడో మీ కడుపున పుడ్తా. ఇదిగోదొరా! యీ బుడ్డోణ్ణి కాత్తె మీ పంచన పడుండనిస్తా యింత గంజో పాలో పోశారంటే పుట్టి

నన్నాళ్లూ మీకు రుణపడుంటా. కరువుదినాలు - పూట గడవకుండా వుంచిదొరా -" అన్నాడు అయ్య.

"అట్లాగే వెంకయ్యా! ఏదో ఆ పని యీ పని చేసి పెడ్తా మాతోపాటే మీ వాడూ వుంటాడు." అన్నాడు అనుమంతయ్యగారు.

మరసనాడు రవిలు తేసనికి తను, అనుమంతయ్యగారు గుర్రబండిమీన ఎల్తావుంటే బండికి ఎనకమాలే అయ్య పొలిమేర్ల దాకా లగెత్తుకుంటావొచ్చి "యిగ పూటావోరా" అంటా తనకళ్లె సెయ్యూపుతా ఆడే నిలబడి పొయ్యాడు.

"పాల్ పాల్" అంటా బజారు వాకిలికాడ గవిడిబర్రె పాలమడిసి కేకబెట్టాడు.

"వెంకటస్వామీ!" అసరిశాడు గదిలోంచి అనుమంతయ్యగారు. ఎగ్గిరెగుస్తా కలల మైకంలో పడ్డ వెంకటస్వామి తెల్లారొచ్చిందనుకుండాడు.

  

ఆ రోజున కనకం, సుందరం బజార్నుంచి ఎగురుకుంటూ వొచ్చి వరండాలో వుండ రెండు నవారు మంచాల్ని గబగబ మోసుకెళ్ళి ఎండలో పడేసి, దబదబ ఏందో యింతలావు పొట్లం యిప్పుతుంటే, యీ యవారమంతా ఓకంట సూస్తుండ ఎంకటస్వామి "అదేంది బుజ్జాయిగోరూ!" అనడిగాడు కనకం, సుందరాల దగ్గిరికెళ్ళి నిలబడ్తా.

"మా నాన్న మాకు సీంటపాకాయలు, చిచ్చుబుడ్లు, ముత్యాల పువ్వొత్తులు, కాకర పువ్వొత్తులు మరే-ఎర్ర మతా

బులు, పచ్చ మతాబులు, నక్షత్రం తీగెలు, విష్ణుచక్రాలు, విమానాలు-మరేఎర్రసిపెట్టెలు, పచ్చని పెట్టెలు, తాటాకు టపాకాయలు, యింకా పామ్మందుకూడా కొనిపెట్టాడు! వీటన్నిట్నీ మేం ఎండబెట్టకుని రాత్రికి కాల్చుకుంటాం" అంటా ఎగశాస దిగశాసల్తో పటపటమనిపిస్తా సెప్పేశాడు సుందరం.

"కాస్త దూరాన్నుండొచ్చు-తమరికి యిక్కడేం తీసుకురాలా" అన్నాడు పెద్దబ్బాయి కనకం.

"నిన్నవురేం అడగలేదయ్యోవ్ ముంగలగానే తొంటి సెయి బయటికి పెస్తుండావుగాసి" అన్నాడు ఎంకటస్వామి జావగారిపోతా.

బ్రదంగా పొట్లాం యిప్పదీసి ఆటన్నిట్నీ మంచాలమీాన పరుత్తుంటే ఆటి రంగులన్నీ మెరుస్తుండ ఎంకటస్వామి కళ్ళల్లో గిరగిర దిరిగిన్నై.

సందేలలోపల మద్దెమద్దె ఎనిమిస్నాన్లు ఎంకటస్వామి ఆ మంచాలకు అంతదూరంగా నిలబడిసూశాడు గాని ఆ ఎనిమిస్నార్లలో నాలుగుసాల్లు కనకం, యింకోనాలుగుసార్లు సుందరం ఆ మంచాల సుట్టూతా తిరుగుతానే వుండారు.

ఆవజాన కనకం, సుందరం అయన్నీ తెచ్చి ఎండలో ఆరబోసేదాకా దీపాలమాాస దగ్గిరకొచ్చిందని తనకు తెలవదు గందా! అనుకుండాడు ఎంకటస్వామి బాయిలో సేదపనినోడు అటనే నిలబడిపోతా.

సిచ్చుబుడ్లు మాలావుగుండాయి గాని, "తమరికి యిక్కడేం తీసుకురాలా" అన్నాడే కనకం - ఎటనబ్బా? అనుకుండాడు ఎంకటస్వామి బాయిలేన్లో నిప్పేస్తా.

పాలెంలోనే గనక తను యిప్పుడుంటే ఏంజేస్తా వుండే వోడు! పోయిన దీపాలమాశకు యింకా దీపాలమాశ పది రోజులుం దనంగానే మాసరాకి తను ఓ పూలగుమ్మటం గట్టి, పూరిమద్దె బజాట్లో ఆ సివర్నించీ యీసివరికి రంయ్ రంయ్‌న దిప్పుతా లగెత్తటం గెపితికొచ్చేతలికి ఒక్కపాలి వొళ్ళు జలద రించి నట్టయింది ఎంకటస్వామికి.

కిందటేడు పది తాడిసెల్లెక్కి, ఆటి గులకసళ్ళన్నీ దులిపి, కోటాయిని బతివిలాడి, పున్నమ్మకొట్టో గంధకం సూరెకారం తెచ్చి ఎన్ని పువ్వొత్తులు కట్టాడు? యీడ అను మంతయ్యగారి మేడగదులన్నీ గాలించినా ఒక్క తాడిసెట్టె యినా అగుపియదు.

గదులన్నీ వూడ్సి, యిల్లంతా దిరిగి మేడమెట్లు పది సార్లు ఎక్కి దిగొచ్చాడు ఎంకటస్వామి ఎందుకయిందీ తెలవ కుండా.

సీకటయినాక కనకం, సుందరం పువొత్తులు కాలుస్తుంటే తంబంచాటున నిలబడుండ ఎంకటస్వామి మనుసు లావజాన పువొత్తులు కాలుస్తుంటే పాలెంలో తను తంబాలచాటున వూరకనే సేతులు ఎనిక్కిబెట్టుకుని నిలడుండేవోడు కాదను కున్నాడు.

"నా మొహంలాగనే వున్నయి యీ పువొత్తులు. మరీ ఆ ఏటికాఏటికి యిట్టె పుటిక్కిని ఆరిపోతూ దిగనారి పోతున్నయ్యేం ఖర్మా? వెంకటస్వామి ఏద్రా - వాడికీ రెండేమన్నా యివంద్రా కాలుస్తాడూ!" అంది అనుమంతయ్య

గారి పెళ్లాం లచ్చిన్నరసమ్మగారు, సిన్నపిల్లని సంకలో ఏసు కుని నచ్చి త్రాల తీగెలుకాల్పిస్తా.

"ఆ, మాకో అమ్మా——" అంటున్నాడు కనకం.

"ఆః ఎవరు కాలుస్తే ఏం యీ భాగ్యానికి చేతులు కాల్చుకోకుండావుంటే అదే పండగ" అన్నాడు అనుమం తయ్యగారు తాటాకు టపాకాయల గుత్తి బయటికిదీస్తా.

"చిచ్చుబుడ్డి ముట్టిస్తున్నావుట్రా సుందరం ? వుండు వుండు-నీకు పుణ్యం వుంటుంది ! అది మొహాన చిమ్మితే కళ్లు కాస్తా పోతాయి. వెంకటస్వామి ముట్టిస్తాడు వుండు – వెంకట స్వామీ!" అని కేకవేసింది లచ్చిన్నరసమ్మగారు.

ఆ నిశిరేత్తిరి ఆఫీసుగది దరవాజా పక్కన సావమీద జవకాణా కప్పుకుని గోడకి నిటారుగా కూకునుండ ఎంకటస్వా మికి వుండట్టుండి అనుమంతయ్యగారి మేడగోడలమద్దెన తనకి వూపిరిసలపటం లేదనిపిచ్చింది.

పాలెం ఒక్క సారి ఎంకటస్వామి కళ్ళల్లో మెదిలింది. పాలెం మడుసులే వేరు ! రెండెడ్లబండిమీన పాటలుపాడ్తా పోలంబోయ్యే బరవయ్యలాంటి మడుసులు యీడ అనుమం తయ్యగారి యింటిసాయల ఎంకటస్వామికి యింతమటుకు యాడా అగుపించలా. పాలెంలో సెరువుఒండయి ఎప్పుడు యీతలీద్దా మన్నా. ఆడ ఎన్నెలరేత్రిళ్ళలో శివుడిగుడిముంగల బలిగుడు ఆణ్ణాట్లు ఒక పెపంచంలో యాడా ఆడరనాల్సిందే. రతం తిర నాలమటుకు రతం తిరనాల ఎట్టుంటది ? పాలెంలో అయ్యతో బాటు పోలం పోవచ్చు. పోలంపని చేసుకువొస్తా గెనువులెంట పిల్లిమిసరకాయలు ఎన్నయినా కోసుకుతింటా యింటికీరావచ్చు.

కోటయ ముటా ఏంజేస్తుండారా? ఆళ్ళు తనని మరిసి పొయ్యారా? ఎన్ని వువాగ్స్తులు గట్టారా గూటా ఏను! ఆళ్ళతో శివుడిగుడిముంగల దీపాలవెల్తుగ్లో ఎట్టవుండమంటే అట్టుంటది. అబ్బ!

"పాలెం ఎల్లానండీ" అన్నాడు వెంకటస్వామి సేతులు నలుపుకొంటూ అనుమంతయ్యగారితో మరసనాడే.

"ఆఁ?" అన్నాడు అనుమంతయ్యగారు ఎంకటస్వామిని యింతగా చూస్తూ.

"వాడికి టపాకాయలు యివ్వలేదని కోపంనాన్నా," అన్నారు ఎంకటస్వామికి ఎనకమాలే వొచ్చి నిలబడ్డ కనకం, సుందరం.

"ఏడ్చాడు వాడి మొహం. అయినా అదేమిట్రా వెంకట స్వామీ? నిక్షేపంగా యిక్కడ జరుగుతుంటే ఎక్కడికో ఆ పాలేనికి పోతానంటా వేమిట్రా చాదస్తం కాకపోతే! చాల్చాల్లే- ఈసారి వాడికీ రెండేమన్నా యివ్వండిరా కాలుస్తాడూ— ఏమిటా చేతులు కాల్చుకుంటానికి" అన్నాడు అనుమంతయ్య గారు.

"మరి మాకో నాన్నా?—" అంటున్నాడు కనకం.

"చాల్లేరోయ్! ఒకటో రెండో వాడికియిస్తే యింతలో తరిగిందేం లేదులే. ఎక్కడికిరా వెళ్ళేది వెంకటస్వామీ— చాల్చాల్లే ఎవరన్నా నవ్వుతారు-వూఁ. లక్షణంగా వెళ్ళి పని చూసుకో— పండగరోజుల్లో యీ పస్లన్నీ వంగాను - వూఁ పోండి పోండి -" అంటూ పేపరు మొగానేసుకుంటారు అనుమం తయ్యగారు.

ఆనాడు సందేల వరండాలో నవారుమంచాల సందున తలొంచుకు కూకుని మణికట్టుతో ముక్కు తుడుసుకుంటుండ ఎంకటస్వామి ఏందో బూడూసుల సప్పుడుకామల్లే వుండదని యిట్ట తలెత్తిసూత్తే మంచమిమ్మానకి వొంగి ముక్కద్దాల్తో తన కళ్లే ఎటకారంగా సూస్తుండాడు క్లబ్బుకుపోయే అనుమంతయ్య గారు.

అనుమంతయ్యగారు ఆనజాన క్లబ్బుకుపోయే పోక తాలికే ఎనిక్కెత్తే మంచాల మయాన్నుంచి లేగిసి అటేటు సూడ నన్నా సూడకుండా బజారువాకిలి బయటబడి, యిదిలిచ్చుకు లగెత్తిన లగెత్తటం, పాలెంలో శివుడిగుడి ముంగల మంటపం మయాన కోటయముటా పూలగుమ్మటాలు తిప్పుతా కేక లేత్తావుంటే యినిపిచ్చుకోకుండా గబగబ తంబంమీంచనించి మంటపం శికరానికి ఎగబాకి, పాలెమంతా సిచ్చుబుడ్లు, అవాయిసువాయిలు, శీంటపాకులు, తాటాకు టపాకులు, ముత్తాలప్రవోత్తులు, కాకరపువ్వొత్తులు, పెట్టిబొమ్మలు పగిలి పాలెమంతా ఎలిగిపోతావుంటం సూశాడు ఎంకటస్వామి.



# నిస్సహాయులు

ఇంకా తెల్లగా తెల్లవారనన్నా లేదు. కుదిపినట్లు లేపి కూర్చోబెట్టింది వెంకట్రామయ్యను భార్య రంగనాయకమ్మ.

పాపంపిలి నిద్రసుఖంలో పడిపోయిన ప్రాణిని ఆ విధంగా కప్పు విరిగి మీదపడుతున్నట్టు బలవంతాన లేపి కూర్చోపెడ్తే ఒకోసమయంలో కొందరు దయ్యాలు భూతాలు మీదబడి పీకినట్టు ఉక్కిరి బిక్కిరై వెర్రిచూపులు చూట్టం మొదలుపెట్టినా పెడతారంటే ఆశ్చర్యపడవలసిన పనిలేదు.

షుమారుగా అంతపనీ తనకు జరిగినట్టుగా భావించినా అమిత సహనంతో తెల్లమొహం పెట్టి రంగనాయకమ్మ వేపు చూశాడు వెంకట్రామయ్య.

"కాస్త భావిలో నీళ్ళు తోడిపెడుదురుగాని లేవండి" అంది రంగనాయకమ్మ.

"నాకేం బోధపట్టంలేదు!" అన్నాడు వెంకట్రామయ్య మెల్లగా గుటకమింగుతూ.

"ఏముంది బోధపట్టానికి? ఆ పనిచచ్చింది, పనిమానుకుంది" అంది రంగనాయకమ్మ.

"అంత ప్రమాదం ఏం జరిగింది ఉన్నట్టుండి మానుకుంటానికి?" అన్నాడు వెంకట్రామయ్య.

"సరేలెండి. ఇప్పుడాపురాణమంతా నిల్చున్నపాటున వర్ణించి మీ కెక్కడ విప్పిచెప్పను - ఆ భావి నాకు అలవి కాకుండాఉంది. తొందరగా లేచి కాస్త నాలుక్కడవల నీళ్ళు లాగిపెట్టండి" అంది రంగనాయకమ్మ.

"బాగా నేఉంది పద్ధతి! తెల్లవారుతుందంటే భయం. ఏ ఆటంబాంబుతోనో సిద్ధమవుతావు; అయినా ఇకమీద నువ్వు నన్ను ఈవిధంగా వేళగానివేళ లేపదల్చుకుంటే కొంచం సౌమ్యంగా లేపుతుండు ఎందుకైనా మంచిది" అన్నాడు వెంకట్రామయ్య.

"సౌమ్యంగా కాకపోతే మీదపడి పీకుతానంటారా, ఏమిట డీ మరీనూ? దయచేసి అయిదారు కడవల నీళ్లు తోడి పెట్టండి. ఇంకా పనులన్నీ అట్లాగే వున్నాయ్" అంది రంగనాయకమ్మ.

"ఇ తకుముందేగా నాల్గు కడవల నీళ్ళు తోడిపెట్ట మన్నావు?" అన్నాడు వెంకట్రామయ్య.

"కాదుమరీ! ఇంతకూ, కాపరమంతా నాల్గు కడవల నీళ్ళతో చక్కబెట్టుతున్నా, సరేనా—తొందరగా భావిదగ్గరకు రండి" అంది రంగనాయకమ్మ.

"ఇంతమంది పనిమనుష్యులు మారుతున్నా ఇప్పటికీ వాళ్ళతో మెలిగే పద్ధతి ఓ పద్ధతికి రావడం జరగలేదన్నమాట" అన్నాడు వెంకట్రామయ్య భావిదగ్గరకువచ్చి నుంచుని.

"ఇదిగో ఈ పనిమనుషులతో ఈ యింటిపనులు మీరు ఒకరోజు సాధించండి. మీకే తెలుస్తుంది నా అవస్థ" అంది రంగనాయకమ్మ వంటింటికి వెడుతూ.

"నేనంటం ఇన్నిసార్లు పనిమనుషుల్ని మారుస్తున్నా వీళ్ళను ఉపాయంగా పట్టుకురావటం నీవు గ్రహిస్తావా – అని" అన్నాడు. వెంకట్రామయ్య భావిలోని నీళ్ళు లాగుతూ.

"మీ పద్ధతి చూస్తే విషయం తెలుసుకోకుండానే యీ పనిమనుషుల్ని నేనే చెండుకుతిని సాగనంపుతున్నట్టు మాట్లాడు తున్నట్టుందే!" అన్నది రంగనాయకమ్మ, అంటుగిన్నెల్ని భావి పక్కకు తెస్తూ.

"కావలసిన అర్థంతీసే నేర్పు నీకుందని తెలుసుననుకో – ఇంతకీ సుబ్బాం పని కెందుకు రానన్నదో చెబితే వింటానుగా" అన్నాడు వెంకట్రామయ్య.

"లేకపోతే మీరు వినకుండా దాచిపెడుతున్నాననటారా ఏమిటి? నేను సుబ్బాన్నేమో రాచి రంపానబెట్టి బైటికి నెట్టి నట్టుగా మీ ఉద్దేశం కనబడుతున్నది" అంది రంగనాయకమ్మ తిరిగి వంటింటొకిపోతూ.

"ఇదిగో–నువ్వు దివ్యదృష్టితో మాట్లాడటం మొదలు పెడ్తే ఇహ నేననేదేమీ వుండదు, పొనీ-రోజంతా ఆఫీసులో వెట్టిచాకిరి చేసొచ్చి పడుకున్నవాణ్ణి నువ్వావిధంగా లేపి ఈ భావిలో నీళ్ళు తోడించటం నీ కేమయినా సబబుగా తోస్తు న్నదా ? పనిమనిషి విషయం ఇంకా పదిసార్లు అడుగుతానంటే అడగనూ మరి?" అన్నాడు వెంకట్రామయ్య ఒక క్షణం చెమట తుడ్చుకుంటూ.

"ఇవాళ రెండు కడవలు తోడేసరికే మీ కెక్కడలేని వుద్రేకం వస్తున్నది. మీరు లేనప్పుడు ఎంత అర్భకురాల నయినా నేనెన్నిసార్లు చెంబెడునీళ్ళు చొప్పున తోడుకున్నానో

మీరుచూడగల్గారా ?" అంది రంగనాయకమ్మ వంటింటి కిటికీ దగ్గరనుంచి.

"అసలీభావిలో నీళ్ళు నిన్నూ నన్నూ ఎవరు తోడమన్నారని ? ఇందాకట్నించి అంటుంటే నువ్వు సమాధానం చెప్పటం లేదు. ఇదిగో మళ్ళీ చెబుతున్నాను, ఇవాళ తోడితే తోడాను. రేపట్నుంచి ఇక ఎప్పటికీ ఈ పాతాళభావిలోంచి ఒక్క చుక్క నీరన్నా తోడను - తోడను - అంతే - ఇంకో పనిమనిషిని ఇవాళే మాట్లాడు" అన్నాడు వెంకట్రామయ్య రొప్పుతూ.

"సరే మాట్లాడక వూరుకుంటారా ఏమిటీ ? మీ చేత మాటలనిపించుకోవటం నాకు మటుకు మనసా ? ఏదో ఏడాదికి ఓనాడు ఇబ్బందొస్తే వీ యింటికి మీరు చేసికొంటున్నారు గాని పరాయివాళ్ళకేమీ చేసిపెట్టటంలేదు. బజారుకువెళ్ళి కాసిని బొగ్గులు, కొంచెం బియ్యప్పిండి మరపట్టించుకురావాలి- ఇంకో రెండు కడవలులాగిపెట్టి మరీ వెళ్ళిరండి" అన్నది రంగనాయకమ్మ పొయ్యిలోనుంచి అంట్లు తోమే దగ్గరపోస్తూ.

"ఇవ్వాల్టికి బొగ్గులులేవా !" అన్నాడు వెంకట్రామయ్య నిస్పృహతో రంగనాయకమ్మ వేపుచూస్తూ.

"ఈపూట కుంటే సరిపోతుందా ఏమిటి ? బియ్యప్పిండి డబ్బా మొన్ననే శుభ్రంచేసిపెట్టా, ఆ తరువాత వంటకాలు యిట్టా వున్నయ్యేమని నన్ననవద్దు" అంది రంగనాయకమ్మ కుంపటి రాజేస్తూ.

"నాకోసం డబ్బాలన్నీ ఖాళీగా శుభ్రంచేసే పెట్టావన్నమాట ? ఇవ్వాళ ఆదివారం కదా అనుకున్నా. అన్నట్టు పిండి మర ఇవ్వాళ కట్టేస్తారేమో ?" అన్నాడు వెంకట్రామయ్య.

"ఇవ్వాళగాదు ప్రతిసోమవారం కట్టేస్తారు" అంది రంగ నాయకమ్మ.

"రక్షించావ్ ! ఇవ్వాళ నాకీ పిండిమర తలంటి తప్ప దన్నమాట ? అయినా యివన్నీ పనిమనుషుల ద్వారా అయ్యే పనులని నీకు తెలియక పోవటం ఆశ్చర్యంగా వుంది ! అసలు యిలాంటివి నాకు అంటకట్టొద్దని యిప్పటికి లక్షసార్లన్నా నీకు చెప్పివుంటా, అయినా నీ మతం నీదిగానే వుంది." అన్నాడు వెంకట్రామయ్య.

"ఎందుకూ మాటిమాటికీ అలా రొసరొస లాడ్తారు ? మన అవసరానికి మనం చేసుకుంటానికీ ? ఇహ ఎవరో ముష్టి వెధవలు చేసిపెడుతూంటేనేం ఏమిటి ఈ జీవితాలు వెళ్ళబా రేదీ ?" అంది రంగనాయకమ్మ కాఫీకి కుంపటిమీద నీళ్ళు పెడుతూ.

"అయితే ఈ భావిలో నీళ్ళు తోట్టం నా జీవిత పరీక్షన్న మాట ?" అన్నాడు వెంకట్రామయ్య.

"మన జీతాలనండి" అంది రంగనాయకమ్మ వచ్చి అంట్లు తోముతూ.

"ఏం, ఎగతాళిగావుందా నీకు ? మన అవసరాలు ఏవికావు ? మన గుడ్డలు మనం నేసి మనం కుట్టుకోవచ్చు ! మాదిగవాడిలాగ మన చెప్పులు మనం కుట్టుకుని మనం తొడు క్కోవచ్చు, యివన్నీ మనం చేసుకోటం లేదేం ?" అన్నాడు వెంకట్రామయ్య రంగనాయకమ్మ దగ్గరికి వెళ్తూ.

"ఎవళ్ళ వృత్తులు వాళ్ళు చేసుకుంటారు, వాళ్ళజోలి మనకెందుకు" అంది రంగనాయకమ్మ వెంకట్రామయ్య వేపు వింతగా చూస్తూ.

"అలాగే పనిమనుషులూను. ఇదిగో నీకు నేను మాటి మాటికీ చెప్పేదల్లా ఇక్కడ ఈ భావిపని, పిండిమరపని, అక్కడ ఆఫీసులో ఆ గవర్నమెంటు డబ్బు లెక్కలు ఒక వ్యక్తివల్ల ఎంతమాత్రం కానిపనని తెలిసికోమంటున్నా! అందుకే మన కష్టం మనకే దక్కకుండా పోతున్నా, ఐదో ఆరో యీ పని మనుషులకు బలవంతాన యిచ్చుకుంటున్నాం. అప్పుడే యీ రెండు రెక్కలూ ఎలా పట్టుకు పోయినయ్యో చూడు! పక్కింటివాళ్ళను విచారించి ఈ పూటే యింకో పనిమనిషి విషయం ఫైసలు చెయ్యి" అన్నాడు వెంకట్రామయ్య.

"నాకుమట్టుకు సరదాటండీ పనిమనిషి లేకుండా యీ అంట్లన్నీ తోముకుంటూ కూర్చొనేను! యీ నాలుగు గిన్నెలు తోమానో లేదో రెండుచేతులూ కారంరాసినట్టు భగభగ మండుతున్నయ్ చూడండి! ఇదిగో యివ్వాళే విచారించి యింకో పనిమనిషి విషయం తెలుసుకుంటాలెండి. వీళ్ళకు వాయవరాను, మరీ అంత డబ్బు దాహమైతే ఎట్లా? ఇవతల వాళ్ళేం కాపరాలు చెయ్యక్కర్లా?" అంది రంగనాయకమ్మ లేచి కుంపటిమీాద నీళ్ళుదింపి కాఫీపొడివేస్తూ.

"ఇచ్చే ఆరురూపాయలు, వారానికోపూట తిండి చాల దంటుందా సుబ్బాం?" అన్నాడు వెంకట్రామయ్య, రంగనాయకమ్మ వెనకనే వంటింటోకి వెళ్ళి.

"అబ్బే దీనివిషయం ఇంకా అంతదాకా రాలేదు లెండి. వెనక వెంకాం చాలదనేగా వెళ్ళింది" అంది రంగ నాయకమ్మ.

"మరి ఎందుకు వెళ్ళిపోయింది సుబ్బాం?" అన్నాడు వెంకట్రామయ్య రంగనాయకమ్మ పక్కగా కూర్చుంటూ.

"ఆఁ, చపలచిత్తంముండ! అయిదు రూపాయలు అప్పు అడిగింది, లేదు పొమ్మన్నాను. అసలు ఏరోజు వాళ్ళు అణా, అర్ధణా వేధించంది? ఒక్కసారే అయిదు రూపాయలు తెమ్మంటే ఎక్కణ్ణుంచి తెస్తారు? అయినా యీ జాతికి అయిదులు, పదులు అప్పులు పెడితే యీ జన్మలో దక్కినట్టే" అంది రంగనాయకమ్మ.

"సరే మన సంపాదనకు తోడు ఇవన్నీకూడ ఎక్కడ నెత్తికి తెచ్చుకుంటాం వదుల్తున్నవి చాలక! ఐనా అంత మాత్రానికే పని మానుకుపోయిందా! వచ్చే యీ ఆరు రూపాయలు పోగొట్టుకుని ఇంకో చోటికి పోతే వాళ్ళు ఇంత జీతం యిచ్చి పైన దానికి కావలసిన అప్పులన్నీ యిస్తారా పిచ్చిదిగాకపోతే! అన్నాడు వెంకట్రామయ్య.

"దాని మొగుడికి జబ్బుగావుందట. మందిప్పిస్తానని ఆ అయిదూ యివ్వమంది. దానికి నెల జీతమిచ్చి ఇంకా వార మన్నా కాలేదు; చూస్తూచూస్తూ మళ్ళీ అయిదు రూపాయలు ఎలాగంట ఇవ్వటం? కోపంవచ్చి వెళ్ళిందేమోగాని రెండురోజు లయినాక మళ్ళీ అదే తిరిగి రాకుండా వుంటుంది?" అంది రంగ నాయకమ్మ కాఫీ డికాషను వడపోస్తూ.

"నువ్వు సందేహాలతో నా ప్రాణంతీయ్యక కబురుచేసి అదికాకపోతే మరో పనిమనిషిని మాట్లాడు" అన్నాడు వెంక ట్రామయ్య.

"దాని మొగుడుకు టైఫాయిడ్ జ్వరమట. యిప్పుడెలా వుందో ఏమోమరి"అంది రంగనాయకమ్మ కాఫీకలిపి వెంక ట్రామయ్య కిస్తూ.

"టైఫాయిడా? దరిద్రులకు తక్కువజబ్బులేమీరావు! ఎవరి ఖర్మ వారిది. నా పర్సుతే బజారు వెళ్ళివస్తా. యీ బియ్యప్పిండి లేకుండా యివాళ్టికి ఏదోవిధంగా సరిపుచ్చే ఉపాయం ఉందా అని!" అన్నాడు వెంకట్రామయ్య.

"అదేమిటండీ మళ్ళీ అలాఅంటారు? పోనీ యివ్వాళ పచ్చళ్ళతో సరిపుచ్చుకుంటారా?" అంది రంగనాయకమ్మ.

"సరే నీమాటేజరగనీ. ఆ బియ్యం సంచిలో తొందరగా పోసివ్వు-పరవాలేదులే; కొంచెం తగ్గించి పొయ్యి. బరువంతా ఒకనాడే మీదపెట్టుకు"—

  

ఈ పనిమనిషి బెడదతప్పేటట్టు లేదనే నిర్ణయాని కొచ్చాడు వెంకట్రామయ్య. ఈ నిస్సహాయతకు బాధ్యులెవ రనేది వెంకట్రామయ్య ఆలోచనకు అందని విషయంగా వుంది. ఏరోజు పనిమనిషి మానుకుని తను భావిదగ్గర రెక్కలు విరుచు కునే దురవస్థ పడుతుందోననే భయంకర పీడకలలు వెంకట్రా మయ్యను ఆవేశించినయ్. ఇటీవలే రత్తమ్మఅనే కొత్త పని మనిషిని తన భార్య పనికి పెట్టింది. ఇవ్వాళ ఉదయం ఆ కొత్త

పనిమనిషి రత్తమ్మా, తన భార్యమధ్య జరిగిన ఘర్షణ యింట్లోనేవున్న వెంకట్రామయ్య విన్నాడు. పనిమనిషి రత్తమ్మ తన పిల్లలిద్దర్ని ముసలితల్లిని తనతో తీసుకువచ్చింది.

"వీళ్ళంతా ఎవరే!" అని తనభార్య రత్తమ్మను సౌమ్యంగానే అడిగింది.

"ఇది నాఅమ్మ, ఈళ్ళు నాసంటోళ్ళు" అంది రత్తమ్మ.

"నిన్న ఆ చిన్నపిల్లనుమాత్రమే తెచ్చావే? యింకా వున్నారా నీకు పిల్లలూ?" అంది తనభార్య.

"ఇంకా యిద్దరు ఆడబిడ్డ లుండారండి" అంది రత్తమ్మ.

"ఆడబిడ్డలా?" అంది తన భార్య.

"అవునండీ అమ్మగోరూ నా పెద్దపిల్లలు. ఆళ్లిద్దరికీ పెళ్లిళ్ళయినయి" అంది రత్తమ్మ.

రత్తమ్మ పిల్లగావాల్ను కావ్ కావ్ మని ఏడుస్తుంటే రత్తమ్మ తల్లిగావాల్ను ఖంగు ఖంగుమనిదగ్గుతూ పిల్లను కూసిని పాలిమ్మంటున్నది రత్తమ్మతో.

"అదేమిటే నీపిల్లట్లా ఏడుస్తుంది?" అనడిగింది తనభార్య.

"అదేమోనండి అమ్మగోరూ తెల్లార్లు ఆవజాన ఏడుస్తా కూకుంటది" అంది రత్తమ్మ.

"పాపం యీగాలిలో దాన్ని అట్టా తిప్పకపోతే యీ ముసలిదానిదగ్గిర యింట్లోనే అట్టిపెట్టి రాకపోయినావుటే?" అంది తన భార్య.

"ఈ గాలికే మాపిల్లలు సెడిపోతే యిక మేమెం బతుకుతాం అమ్మగోరూ. మా అమ్మకి కాళ్లూసేతులు పడిపోయినయ్యమ్మగోరూ. పొద్దత్తమానం పనిజేసుండ పానంగనక

యింటికాడ ఏమీ తోచక నాయెంట వత్తానంటది. నేనంటే మా అమ్మకు బహుపానం. పెద్దదయిందిలెండి. అదేంటోనండీ అమ్మగోరూ, దగ్గు బట్టుకుండదది మా అమ్మకు. ముసల్దానికి కాత్తె సద్దబువ్వేమన్నావుంటే పెట్టండి అమ్మగోరూ. దగ్గుతెర కాస్తె తగ్గుద్ది" అంది రత్తమ్మ.

"ఒక్క మెతుకంటె ఒక్క మెతుకు మిగల్లేదు. అసలు మా యింటో చద్దన్నాలు మిగలవు" అంది తన భార్య.

"పోనీలే అమ్మగోరూ కూసిని సల్లసుక్కంటే పొయ్యండీ ముసల్ది పసిదీ తాగుతారు; నిన్న మాపిటాల ఇంతంటే యింత బువ్వ తినటానికి లేకపోయిం దమ్మగోరూ" అంది రత్తమ్మ.

"అదేమిటే రత్తమ్మా మీ పనివాళ్ళు మమ్మల్ని నిలువునా యిట్లా తోడతారు? కొంచెం అన్నం, కొంచెం మజ్జిగ, కాసిసి డబ్బులనీ? ఆ కొన్న పాల్లో సహం పొంగి పొయిలోనే మాడినయ్: ఆ వున్న కొంచెంలో పందేరా లెక్కడచేస్తూ కూచోను? పోనీ మీ కిస్తామన్న జీతంలో ఒక్క కానీ తగ్గిస్తే అప్పుడనవచ్చు మమ్మల్ని. మీ సంసారమంతా తెచ్చి మా గొంతుమీద కూచోబెడితే మే మెక్కడ భరించం ఊళ్లో వాళ్ళందర్నీ? ఆ సుబ్బాం, వెంకాయమ్మా, యింతే. వున్నన్నాళ్ళూ యీ విధంగా మాప్రాణాలు నిలువునా తోడారు. చీటికి మాటికి మమ్మల్ని వేధించక లెఖ్ఖప్రకారం మీ పని మీరు చేసిపోతే మీకు పదివేల దణ్ణాలు" అంది తనభార్య విదిలించేసినట్టు.

ఇంతలోనే కొత్తపనిమనిషిమీద తనభార్య కోపం తెచ్చుకోటం వెంకట్రామయ్యకు గుండెదడ సాగినట్టయింది.

ఇదిగో యీ అసహనంతోనే తనభార్య మెళుకువ లేకుండా ప్రవర్తించి సమస్యను గొంతుమీదకు తెచ్చి, తను హైరాన పడి, నన్ను హైరానపెడుతుంది. పనివాళ్ళ నా విధంగా దులి పేస్తే వాళ్ళుచేసే పనిమీద వాళ్ళకే విశ్వాసంలేక నాలుగు రోజులు ఎగనాంపెడితే మనపని దుమ్మెత్తిపోసుకోటం, ఆ భావి జీవానబడి ఏడవటమున్నూ! అయినా ఆ విధంగా రత్తమ్మ తన కడుపులోవున్నంతా కలుపుకుని తమమీదకు దండెత్తిరావటం తన భార్యా తనూ సహించటం కష్టం అనుకున్నాడు వెంకట్రామయ్య.

"మాకు దణ్ణాలేమిటండమ్మగోరు. పాపం నుస్టుకుంటది. బీదోళ్ళం. తమవంటోరి పంచను బతుకుతుంటాం. తమనిగాక యింకెవుల్ని అనుక్కుంటాం అమ్మగోరూ? ఇంటుంటే పెడ తాను, లేకపోతే లేదంటాను" అంది రత్తమ్మ.

"రత్తమ్మా అటుచూడూ - చూడూ మీఅమ్మ దగ్గి అక్కడే ఉమ్మేస్తున్నది-ఛీపాడు క్షయరోగాలు పట్టుకుంటాయ్ అలా ఎక్కడపడితే అక్కడ ఉమ్మేస్తే-అయినా యిదేమిటి పాడూ! మాయిళ్లేం నడిబజారనుకుందా పెంటపోగనుకుందా ఆ మనిషి? నీకు పుణ్యముంటుంది మీ అమ్మను యింటికి పంపవే రత్తమ్మా" అంది తనభార్య.

"దగ్గుతెరొచ్చి తెలవకుండా కల్లె పడిపోయింది కోపం సెయ్యాకండి అమ్మగోరూ. ఎంత తెలవకపోయినా యీడ తమింటో ఎట్ట ఉమ్మాత్తానండీ-సీ చచ్చిందాన్ని-" అంది రత్తమ్మ తల్లి.

"బాగానేవుంది సంబడం–నువ్వు పసికాస్త తొందరగా కానిచ్చిపోమ్మా రత్తమ్మ తల్లీ–అదేమిటీ–చూడవే రత్తమ్మా నీపిల్ల బయటికి కూచున్నట్టుంది– రామరామ యిదేంపాప ఖర్మం–పాపం బద్దలైంది – పీడా విరిగిపోనూ తియ్యవేమే చూస్తావూ–ఖర్మగాల" అంది తనభార్య అంతిమస్థాయినందుకుంటూ.

"పీడగీడంటున్నారు పసి గుడ్డుదానికేం తెలుసుద్దండీ–సిన్నపిల్లనావజాన అనమోకండీ అమ్మగారూ, సెడ్డ కష్టం గుంటదీ" అంది రత్తమ్మ.

"అడుక్కుతిన్నట్టే ఉంది అభిమానం – ఇదిగో నీకిష్ట ముంటే ఒక్కత్తేఒచ్చి పనిచేసి పోతావాపో. లేకపోతే నీదారి నీది. ఈ విధంగా మా మీద దాడిసాగిస్తే మటుకు పూరుకునేది లేదు నీయిష్టం తర్వాత" అని గిరవాటు వేసినట్టన్నది తన భార్య.

ఇహ కూచున్న చోట ఎంతమాత్రం కూంచోలేక దొడ్లో జరుగుతున్న సంఘటనలకు అసమ్మతి సూచకంగా పెద్ద శబ్దంతో గభాల్న తలుపు తెరచి రపీమనిమూసి యింట్లోంచి ఎటుగానో వెళ్లిపోయాడు వెంకట్రామయ్య.

  

"ఇవ్వాళకూడ యీ రత్తమ్మ పనికి రానట్టేనా?" అన్నాడు వెంకట్రామయ్య దీనంగా భావి లోతు చూస్తూ.

"బలవంతంగా వెళ్ళమనేంతదాక తెచ్చుకుని మరీ వెళ్ళింది" అంది రంగనాయకమ్మ అంట్లు బయటపడవేస్తూ.

"మొత్తానికి ఏమయితేనేం పర్యవసానం నువ్వాంట్ల దగ్గర, నేను భావిదగ్గర మిగిలాం. అవసరం వున్న పనిమనిషికీ మనకూ మధ్య ఒక పెద్దగొయ్యి యేర్పాటయి కూర్చుంది" అన్నాడు వెంకట్రామయ్య.

"ఆ గొయ్యి నేనే తవ్వానంటారా ఏమిటి?" అంది రంగనాయకమ్మ.

"సమస్య ఎవ్వరు తవ్వటమ నేదికాదు, గొయ్యి ఏర్పట్టమే కావలసింది. రత్తమ్మాగాకపోతే వెంకమ్మ, ఎవరైనా ఒకటేగానే వుంది మనకు" అన్నాడు వెంకట్రామయ్య.

"మీా సూటీ పోటీ మాటలు అనవసరంగా నామీాద ప్రయోగించకండి. ఆ గూడెంలోని గుంపునంతా తెచ్చి శక్తి వుంటే మీారే పోషించండి. అయినా ఒక్క పనిమనిషిని మాట్లాడుకుంటే కుటుంబమంతా వచ్చి యిక్కడే తినిపడు కుంటానంటారేం – ఛీ యీా సూద్ర సుఖన్నాం మూాకను స్గా? ఎగ్గా? డబ్బాపోయి కని పట్టుకొన్నట్టు యిదేం పాప ఖర్మం!" అంది రంగనాయకమ్మ.

"సరే రోజూ వుండేవానికి యింతగట్టిగా ఎక్కడ విచా రిస్తూ కూచుంటాం ...... యీా రత్తమ్మకన్నా ఆ సుబ్బామే నయమన్లేవుంది. కిక్కురు మనకుండా పని చేసుకుపొయ్యేది. ఆ అయిదు రూపాయలు యిచ్చినా పై నెలలో బిగబట్టుకునే వాళ్ళం" అన్నాడు వెంకట్రామయ్య.

"ఇంకానయం! తీరాయిచ్చారుకాదు! అంతకుముందు అది ఎన్ని అఘాయిత్యాలు, అణాలు దిగమింగిందో మీాకేం తెలుస్తుంది. దానికన్న అంతకుముందు వెంకామే కాస్తనయం నాలుగు

రూపాయల జీతాన్ని అయిదురూపాయలు చేయమంది. చివరికి పట్టుదలకంటూ పోయి తర్వాత పనిమనిషికి యింకో రెండు ఎక్కువే యిచ్చుకున్నాం. అన్నట్టు ఈ సుబ్బాం తన మొగుడుకి జబ్బుగా ఉందనే పోయిందిగాని పని మానుకుంటానని గట్టిగా చెప్పినట్టులేదే." అంది రంగనాయకమ్మ.

"అవును దాని మొగుడుకి ఏదో జబ్బజేసిందికాదూ? ఎట్లా ఉందో పాపం!" అన్నాడు వెంకట్రామయ్య.

"టైఫాయిడుజ్వరం అనుకున్నారు గాదుటండీ ఏమో పాపం; ఏం తెలిసినా మన మారుస్తామా తీరుస్తామా? ఈపాటికింకా తగ్గకుండా వుంటుందా? సుబ్బాం దాని మొగుడు వూరు వెళ్ళిందట లేండి, లేకుంటే యీపాటికి పాపం ఎట్లా వుందో విచారించి తెలుసుకుందుం" అంది రంగనాయకమ్మ.

"పాపం పుణ్యాం మనకెందుకు, ఎంత ఖర్చుకావడం లేదు? ఆ అయిదు రూపాయలు యిచ్చివుంటే యెంతోకొంత ఆ గోష్ఠికి ఉపకరించేదేమో. ఇట్లాంటివి ప్రాణం పీకుతూనే ఉంటయ్" అన్నాడు వెంకట్రామయ్య.

"చీటికి మాటికి ప్రాణం తోడుతుంటే ప్రాణం విసిగి వీళ్ళకేం యివ్వబుద్ధిపుట్టదుగాని లేకపోతే అంత కర్కోటకంగా మనం మటు కెందుకుంటాం చెప్పండి?" అంది రంగనాయకమ్మ సానుభూతి తెలియజేస్తూ.

"ఇంకా పని మనుషులెవరయినా యీవూళ్లో దొరుకుతారేమో విచారించి చూడు" అన్నాడు వెంకట్రామయ్య.

"సమయంచూసి మీరు బాగా హాస్యంగా మాట్లాడతారండీ! రెండు కడవలనీళ్ళు ఆ భావిలోంచి లాగటానికి

కెందామీద పడ్డారుగాని యీ డొంకతిరుగుడు తెలివితేటలు యెందుకండీ వుపయోగిస్తారూ?" అంది రంగనాయకమ్మ అంట్ల వద్ద కూచుంటూ.

"ఏదో పాపం నీ చేతులకు కారాలు, మిరియాలు రాసి నట్లున్నదని—" అని అన్నాడు వెంకట్రామయ్య భావిలో నీళ్ళు లాగుతూ.

"చాల్లే కట్టిపెట్టండి యుద్ధం! ఎవ్వరయినా వింటే ఇట్టే నవ్విపోతారు! అయ్యో ప్రయోజకత్వం-ఎవరదీ?"

"నేనే దొరసానమ్మగోరూ-సుబ్బాన్ని" అంది సుబ్బాం, అక్కడికొచ్చి నిలబడుతూ.

రంగనాయకమ్మ అంట్లదగ్గర్నుంచీ, వెంకట్రామయ్య భావిదగ్గర్నుంచీ నిద్రల్లో నడచినట్లు యివతలికొచ్చి సుబ్బాన్ని వింతగా చూస్తూ నుంచున్నారు.

"బాగుండారా దొరసానమ్మగోరూ" అంది సుబ్బాం తలవంచుకుని.

"ఎప్పుడొచ్చేవే సుబ్బాం వూరునుంచి?" అంది రంగ నాయకమ్మ.

"నీ మొగుడుకు నయిమయిందంటే? అన్నాడు వెంక ట్రామయ్య.

"పాపం! ఎట్లావుందే నీ మొగుడికి!" అంది రంగనాయ కమ్మ.

"ఆయనప్పుడే పోయినాడుగదంటండీ - యేందో లెండి బ్రతికినన్నాళ్ళూ ఏదోరోగాలతో తీసుకుంటూనే ఉన్నాడు- అంటూ వాపోసుమంది సుబ్బాం.

వెంకట్రామయ్య రంగనాయకమ్మలు నిర్ఘాంతపోయి అలాగే నిలబడిపోయారు సుబ్బాం కేసి చూస్తూ.

"అమ్మగోరూ యెవుర్నన్నా పనికి కుదుర్చుకుండారా!" అంది సుబ్బాం కొంచెం సేపయినాక రంగనాయకమ్మ, వెంకట్రామయ్యల వయిపు ఆశతో చూస్తూ.



# బలకట్టు పాపయ్య

ఏకువజామున తొలికోడి కూసేయాల మెట్టపల్లి, సొట్టపల్లికి మధ్యాన పారుతుండ కిట్టకాలవ గెట్టుమీాన్నుంచి ఎవురయినా నిలబడి సూత్తాయింటుంటే, మెట్టపల్లి ఏపుల్నుంచి సీకట్లో బజనపాటలు యినిపించి, యింకాసేపటికి డొంకల్లోంచి సేతికర్ర పొడుసుకుంటా ఓ నల్లయిగ్రహం మిట్టపల్లాలు ఎక్కి దిగుతా వొచ్చొచ్చి, కిట్టకాలవ గెట్టెక్కి ఆడ గొలుసుతో కట్టేసుండ బల్లకట్టుకాడికొచ్చి నిలబట్టం తెలుసుద్దన్నమాట. ఆ యిగ్రహం బల్లకట్టు పాపయ్య.

పాపయ్యపని ఏకువజామున తొలికోడికూసే యాల్టినుంచి రేత్తిరి జనం తిరుగాట్టం మాటుమణిగేదాకా కిట్టకాలవలో బల్లకట్టు నడపటం. బల్లకట్టు ఉద్యోగమయినాక పాపయ్య బల్లకట్టు పాపయ్యయినాడు, ఆ సుట్టుపక్కల వూళ్ళ జనానికి, వుత్తపాపయ్యంటే పాపయ్య ఎవురికీ తెలవదు.

పెద్దమనిసి, నమ్మకస్తుడు, ఎవురిజోలికీ పోడు, పద్దాకా బజనపాటలు పాడుకుంటా వుంటాడని వూళ్లో పదిమందీ అనుకుంటుంటే నెలకు ఆర్రూపాయలపావలాకాడికి బల్లకట్టు ఉద్దోగమయింది పాపయ్యకు.

పెల్లాం బూసమ్మ కట్టిచ్చిన సద్దిమూట బల్లకట్టు లోన బెట్టి సెక్కముాతేసి, కాత్తె సలిగావుంటాన దుప్పటి అటనే

కప్పుకుని, బొడ్లోంచి పుగాకు పాయదీసి వాసనసూసుకుంటా, యిప్పుట్నుంచి బల్లకట్టుకు కరుసుక్కూపోటం దేనికనుకుంటా కాలవగట్టుమీన కూకుని సుట్టముట్టిచ్చి, జనం ఎవురన్నా వొత్తావుండారేమోనని సుట్టుపక్కల సీకట్లో సూత్తా..... ఆలోశనలోపడ్డాడు బల్లకట్టుపాపయ్య.

ఇంగా జనం ఎవురూ తిరగాట్టం లేదే? ఏంజనమో, ఒక్కోపాలి కోడికుయ్యకతలికే వొచ్చి తపనబడ్తా కూకుంటాను. ఇంకోపాలి రేత్తిరి యిట్టా యింటికెల్దామని బయిలెల్లి సగం లెక్క బోయినాక ఎవరోవొకరు దారిమయాన అడ్డుబడి 'గడ్డంపట్టుకుంటా కాత్తే కాలవ దాటేసెళ్ళు అన్నన్నా' అంటా పానందీత్తారు – ఏంమనుసులో! యియ్యాల పడవలేం రాటంలేదే? రాతారిబోటు వొచ్చేయాలయింది, యీరాతారి బోటుదగ్గా రవిలుబండికన్నా వుండదు. ఒచ్చి వొకటేమయిన బాకావూత్తా కూకుంటారు జనాన్ని పోగుజెయటానికి, యీళ్ల ఆర్బాటమేగాని యీడ జనం యిట్టాటి లంకణాల బోట్లెక్కకేం? యీరోజుల్లో యీడజూసినా బస్సుబుట్టి మా జోరుమీన లగెత్తుతుంటే, యీ రాతారిబోటుకో రేందంటా మద్దనా? అయినా యిప్పటికీ కొంతమంది వుండాల్లే! అలవాటుకునో, కరుజు తక్కువనో, మరదేమన్నా బకింగో, పయానం పది రోజులపాటయినా బోటెక్కి పోతావుంటాను. బల్లకట్టంటే దానిదారే వేరు. కాలవకు అడ్డంగా బస్సేడపోద్ది? ఒంతెన్లూ, బిర్జిలంటే యీడబడ్తే ఆడ ఎట్టుంటై? యిట్టాటి కిట్టకాలవకు బల్లకట్టు లేకనేపోతే జనం అల్లాడిపోవల్సిందే ఎప్పటికయినా! అసలు పొద్దుగూకులూ యిట్ట గుక్కదిప్పుకోటానికి యీలవుద్దా

బల్లకట్టు మడిసికీ? ఓ కూరగాయల మడుసులేందీ, పుగాకు, మిరబగాయ, నెయ్యి, ఎన్న, పాలు, పెరుగు, నాట్లజనం, కోతలజనం, ఆ రేంది యీరేంది అన్ని యాపారాలూ యీ బల్లకట్టుమీాన నడవాల్సిందేగా? యివాల గొల్లజనం యింగా రాలేదే దబ్బా? ఆళ్ళొస్తేసరి కాలకడాలు, సేతి మురుగుల్తో బల్లకట్టుమీానంతా యుద్దెంసేసిపోతారు - అదోకరకం!" అనుకుంటూ పుగాకుమైకంలో ఏందేందో రకరకాల ఆలోసెనలు సేసుకుంటుండ బల్లకట్టుపాపయ్యకు "ఓ ఏమిరొయ్యావ్?" అంటూ సెవిలో టూప్పున బాకావూదినట్టు ఎవురో కాలవ ఆతలి గట్టునుంచి అరిశారు.

వులిక్కిబడి, పరకాయించి సూశాడు బల్లకట్టుపాపయ్య. జనం సాగారనుకుంటూ. కట్టకాలవ ఆతలిగట్టున ఎవురో గెడ కర్రకుమల్లేవుండ యిగ్రహం తొందరమీానగాంవాలు కదం దొక్కుతా అరుత్తావుండాడు.

"ఓ బల్లకట్టు పాపయ్యోవ్-ఓ నిన్నేనయ్యోవ్? వుండా వంటయ్యా ఆడా!" అనరిసింది ఆతలి గట్టుమీాన యిగ్రహం.

"ఆ ఆ, వున్నాలే-" అంటూ వొళ్ళు యిరుసుకుంటూ లెగిశాడు బల్లకట్టుపాపయ్య.

"వున్నావంటయ్యా? నీ యిల్లు బంగారంగాను కాస్తె దొబ్బున రానీవయ్యా బల్లకట్టునూ, పొద్దెక్కుతుండదీ," అంది యిగ్రహం గబగబ.

"అహాం, అంత తొందరైతే ఎట్టా? కాస్తె నిదానించ వయ్యా నువ్వు ఎవురువోగాని - యీాడ బల్లకట్టు గొలుసు వూడ దియ్యాలా, గెడ సేతికి తీసుకోవాలా, మరి కాస్తె నిల్దొక్కుకో"

అన్నాడు బలకట్టు పాపయ్య, సేతులకు కాత్తే నోటి ఆవిరిపడ్తా.

"ఆఁ, అదెంతసేపులే సార్వోసయిన మడిసికి! గెట్టిగా రెండు తోపులు తోశావంటే అయిపాయె! రానీరానీ దొబ్బుబ" అంది యిగ్రహం.

"మల్లీ అదేమాటా! ఎంతలెక్క నించి వొత్తుంఁడావేఁ?"

"యిప్పటికి రెండుకోసులు నడితినీ యింగా రెండున్నర కోసులు పైసిల్కు పోవాలాయె, రానీ, రానీ," అంది యిగ్రహం.

"నీ మడిసిదొంగల్దోల! రెండుకోసులు నడ్సినోడివి బల్ల కట్టుకు రెండు నిమిసాలు ఆగలేవంటయ్యా? మందేవూరేం?"

"దనియాలపాడు, ఎవురన్నా తెల్సా ఆడా?"

"బలేనోడివి! దనియాలపాడే తెలవదంటా? ఎంకట కిట్టయ్య బాగుండాడా?"

"చరేలే ఎంకటకిట్టయ్య మా మేనమామేగా! ఆయన కేం రాయికిమల్లే వుంటే మడిసీ! నాపేరు రాంకిట్టయ్యలే!"

గెట్టుకు బల్లకట్టు సేరీసేరకతలికే రాంకిట్టయ్య దడదడ మంటా ఎక్కి కర్లమీన కూకని, యిగ బల్లకట్టును పోనీ మన్నాడు.

"పోనిత్తాలే, యింగా మడుసులెవురన్నా వత్తుండా రేమో సూద్దాం వుండు" అన్నాడు బల్లకట్టు పాపయ్య అటిటు సూత్తా.

"సూసేదేంది! యిగచరేలే! తెల్లారిపోయేదాకా యీగెట్టకాడే కూకోబెడ్తావట్టా? నేనసలే సానాదూరం పోవాలంటుంటే అటిటు దిక్కుల్జూస్తా మాటనిపిచ్చుకోడేం;

ఎయ్ ఎమ్ గెడేసి తోయవయ్యా దొబ్బునా నీ పాపయ్య బంగారంగానూ! పుగాక్కాడ కావలెట్టా? యింద కాల్చుకో, మడుసు లెవ్వురన్నా వొత్తావుంటే మళ్లీ తిరిగొద్దువులేగానీ నడుపు నడుపు!" అంటా రాంకిట్టయ్య కణ్ణీపట్టుకుని సింగు ల్దొక్కాడు.

"ఎవ్వుడు జూసినా యిదిగిదీ వరస, పద్దాక అటీటు బల్ల కట్టు నడపటమంటే మాటలంటయ్యా? కాలవ పారుదలస్తూడు ఎట్ట తోస్తావుండదో? పుగాక్కాడకేంగానీ ఓ కానీ బిల్లకూడా వుంటే సగాడు ఎందుకయినా పనికొచ్చుద్ది" అన్నాడు బల్లకట్టు పాపయ్య బల్లకట్టు నడుపుతా.

"సిల్లరేం వుండట్టులేదే - ఎల్లుండి మళ్లీ తిరిగొత్తాగా, అప్పుడిచ్చిపోతాలే కానీ యాడికిపోద్ది! అయితే బల్లకట్టు పాపయ్యన్నా? మనకి నెలకి జీతం ఎంతొచ్చుద్దంటా?"

"ఆఁ, వుంటదిలే దెగ్గిర దెగ్గిర అర్రూపాయాల పావలా - ఏంసాలుద్ది సచ్చి?"

"పరవాలేదే? ఎప్పటికయినా డబ్బు డబ్బే! పైన ఏమాత్రం?" అన్నాడు రాంకిట్టయ్య.

"పైనేంవీ?" అన్నాడు బల్లకట్టు పాపయ్య.

"ఆఁ, అదేలే, పైన కాత్తెకూత్తే సంపాదనవుంటది కావాల్నుగా? అటీటు వొత్తా పోయే జనం అదిదంటూ ఏవన్నా యియ్యరంటయ్యా?"

"అదిదేంది? యిప్పుడు నీ సంగతేంది సెప్పరాదూ? ఎల్లుండి సిల్లరమార్చి తెత్తానంటుంటివి! అదిగంతే పైసంతే."

"ఆర్నీ బల్లకట్టు పాపయ్యా దెబ్బతీశాడే! అయితే మాటంటే నమ్మకం లేదంటావ్? సరే నువే సూత్తావుగా ఎల్లుండి, అయితే నీకు పెల్లాం బిడ్డలుండారా! వుండక యాడికి పోతారనుకో! యింటికి మల్లీ ఎప్పుడుపోతా? రేత్తిరి బాగా పొద్దెక్కేద్దాం! మరి బల్లకట్టు పనంటే యిగనంతేగా! తెల్లారి సీకట్తో వొత్తా సద్దిబువ్వ తెచ్చుకుంటావుగావల్నా. మరి మద్దానం బువ నీ పెల్లాం తెచ్చుద్దాం? సెప్పిన మాట యింటదా నీ పెల్లాం? యినక ఎట్టుంటదనుకో! పిల్లలెంతమందీ? నీకు నలబై ఏళ్ళుంటయ్యనుకుంటా – అసలు నలబయ్యేన్నా లేంది బల్లకట్టు పనికి పనికి రారనాల్సిందే – గట్టుకు చేర్నట్టుందే? మంచోడివిలే అన్నా – ఎవురో అప్పుడే తట్టలెత్తుకొస్తుండారే కోకలెగ్గట్టి? ఆర్నీ గొల్లజనం! బల్ సందడి గుంటదిలే – ఆవులెల్లుండి యిత్తాలే కానీబిల్లా – ఎల్తుండా బల్లకట్టు పాపయ్యనోళ్లేవ్," అంటా పటపట మిరపగాయలు ఏపినట్టు మాటలు దొలిపి, గెట్టుమీనకి దూకి గొల్లజనాన్ని ఓసూపు సూత్తా, అంగలేసుకుంటా గెట్టు దిగి డొంకల్లోబడి మాయమయ్యాడు రాంకిట్టయ్య.

"ఓ బల్లకట్టు పాపయ్యానోళ్లేవ్? యిటేవుండావంటయ్యా? నీకు పున్నెంవుంటది కాత్తె ఆదరికి దొబ్బునపోనియి బాబూ, అప్పుడే తెల్లార్తుండది! నాగరత్తీ రాయేవొబ్బునా? చుబ్బక్కా, లచ్చుమ్మా రాండి రాండి – ఎంకాయి పిన్నాం ఏదీ? ఓ చీతామాప్ లరాయ్ లగెయ్?" అంటా గొల్లజనం కడాలు, గొలుసులు కొట్టుకుంటా, మట్టెలు టక్‌టక్‌మనిపిస్తా, పెరుగోసన గబ్బుమనిపిస్తుంటే, రవిలుబండి పెట్టెలకుమల్లే తోసు

కుంటూ వొచ్చి బల్లకట్టుమీన నుంచుండారు సోల్పున మాసికా, తవ్వా, సోల, గిద్దలూ మళ్లే.

"అంతా వొచ్చారా యింగా ఎవురన్నా పొదలసాటున వుండారా?" అన్నాడు బల్లకట్టు పాపయ్య గెడమీన ఓరగా ఆనుకుని సూత్తా.

"పొదలసాట్నుందయ్యోవ్? సింతసచ్చినా పులుపు సావ లేదంట! యీ బల్లకట్టు పాపయ్యకు పళ్లు మిగులుండా సెతురు తగ్గటంలేదే? నవుతావు దేనికే నాగరత్తి? మరి సూడమ్మా యీ పాపయ్యకు తెల్లారిం దప్పుడే సెకురాడనూ," అంది ఎంకాయి సిన్నాం.

"అదేంది సిన్నాం అట్టంటదేం? గెడకర్రకమల్లే పాపయ్య అట్టాంటే పళ్ళు మిగట్టమేంది పాపం – యిహీ హిహీ–" అంది నాగరత్తి కొంగుచాట్న పకపకమంటా.

"అదేంది పిల్లోవ్ అట్టెరగపెట్టుండావు? ఆ పొళ్లు కాత్తా రాలి కాలవలోపడేను!" అంది చుబ్బక్క.

"అదేంది చుబ్బమ్మోవ్ అట్టంటావ్? దాని పళ్ళు చూసే పుల్లన్న దాన్ని కట్టుకుంటే!" అన్నాడు బల్లకట్టు పాపయ్య గెడేసి బల్లకట్టు నడుపుతా.

"సూడే ఎంకాయిసిన్నాం యీ పాపయ్యా? నన్నంటే అన్నావుగానీ యింటికాడ మా బూసమ్మొదినకాడ అనే వమ్మోయవ్ బద్రం వొళ్లంతా పిడకలు కొట్టుద్దీ!" అంది నాగరత్తి.

"అయితే పద్దాకా యీ పుత్తకబుస్సినా లేకబోతే యియ్యాలన్నా కాత్తె పెనుగు సద్దిబువలోకి పోత్తారా?" అన్నాడు బల్లకటుపాపయ్య.

"కాస్తె పోయిరాదంటే నాగరత్తి!" అంది లచ్చుమ్మ.

"ఆఁ, నువ్వు పోయరాదూ సాటుగా మూలకూకుండావు గానీ? యియ్యాలసలే నా పెరుగు తగ్గింది ఏం మాటొచ్చిద్దో, పిన్నాంకాడ ఏమన్నా దొరుకుద్దేమో?" అంది నాగరత్తి.

"చరే నాసంగతి పాపయ్యన్నకే తెల్చు" అంది ఎంకాయిపిన్నాం.

"పులుపు సిచ్చుగుండది మరీ యియాల నాపెరుగు! మరీ యిదెట్టపోయనమ్మా - కాదంటే చుబ్బకా?" అంది సీతాం.

"యిదిగో మద్దె మీారెందుగ్గాని కొట్టుకోటం గెట్టొచ్చింది దిగండి దిగండి; మీాసంగతి యియాల నాకేమన్నా కొత్తేట్టా? రత్తమ్మ వొత్తాంవుంటే మిమ్మల్ని అడక్కనేపోదును. పోనీగానీ ఎవురో ఒకరు రేపన్నా కాస్తె పోసిపొండి," అన్నాడు బల్లకట్టు పాపయ్య.

"ఓ, రేపు తప్పకుండా నలుగురం నాలుగింతలు పోసిపోతే సరిగా - దిగరేమే యింకా కూకుండారూ? రాండి రాండి పొద్దెక్కింది -" అంటా తోసుకుంటా గెట్టుదిగ ఎల్లిపొయ్యారు గొల్లజనం.

అటేపు సూసి దగ్గిర్లో జనం ఎవురూ లేకబొయ్యేతలికి యాపుల్ల యిరుసుకుని నోట్లోబెట్టుకుని, గెట్టుమీాన కూకుండాడు బల్లకట్టు పాపయ్య.

సంకురేత్తిరి దగ్గిరకొస్తుండది యిగ కోతలజనం సాగుతా రనుకుండాడు పాపయ్య. యాడ జూసినా వొడ్లగింజ అగుపిస్తా వుంటది. దొబ్బున కోతలొస్తే బాగుండుననుకుంటాడు

పాపయ్యా. అయినా యీ కూలిజనానికి తగువాడుకోడంతోనే సరిపోద్దిగాని పక్కవోడిమాట యినిపిచ్చుకోనే యిపపిచ్చు కోరు. అదేమంటే ఆసాములు కూలిగింజలు సరిగా కొలవటం లేదంటాను. ఎంతసెడ్డా ఆళ్ళు కూలిజనమేగా మరి? మిరబ గాయదర పెరిగిందంట. పద్దాకా బల్లకట్టు తొందరేగాని ఏమన్నా యియమంటే రేపు రేపంటాడే ఎప్పుడు సూసినా యీ రంగయ్య! ఆనోరికి శోస్తే ఏమన్నా యిచ్చిపోతుండా ల్సిందేగాని గట్టిగా ఎవుర్ని ముఖకేం నిలవసేస్తా, తప్పాగాదూ? బల్లకట్టు ఎక్కనియ్యకుంటానికి నాయ బ్బసొమ్మొట్టా బల్లకట్టా? యింటో సూడబోతే యీ బూసమ్మ నే నేమో మాటలు కట్టుకురాటం లేదనుకుంటది. యిక్కడి యవారం సీకు తెల వదులే అంటే నీకు నోట్టో నాలిక లేదంటది. యింటో వుండే ఆడకూతురుగనక అదామాటన్నది. "యీ గాగ్యానికి చీకట్లో ననంగా తెగిసెల్లి వ్రాను నిదరబోయినాక తిరిగి రావాలా?" అంటది. సీకట్లో తెగిసాస్తుంటే పంచపట్టుకు గుంజుగ్ని తెల్లారినాక పోవచ్చులే అంటా. పద్దాకా మంచంలో కూకుంటానికి ఎనక తింటానికి నీ కేవన్నావుంటే గదా? ఎంగో, దాసిరంటి దాన్నేగాని యివకాడ యవారం కాత్తైన్నా తెల్సుకోక్కన్లా? చుబ్బయన్నా అగుపియటంలేదే కాత్తై అప్పేవన్నా యిస్తా డేమో అనుకుంటుంటే?" అనావజాన ఎటుటుగానో ఆలోసె నల్లో బడిపోతుండాడు బల్లకట్టుపాపయ్యా.

"ఓ బల్లకట్టు పాపయ్యానోవ్, రావయ్యా, రావయ్యా ఆ తలేపుకెల్లి అటనే కూకుండావూ?" అంటా అరుస్తా ఆతలేపు

జనం గట్టెక్కటం నూసేతలికి వులిక్కిపడి లెగిసి తెచ్చుతీసు కుంటాడు బల్లికట్టు పాపయ్య.

"మీ అమ్మ రాలేదేరా కొండయ్యా? అంతలావుపనేం జేత్తుండ దబ్బా యింటికాడా!" అన్నాడు బల్లికట్టు పాపయ్య. కొడుకు కొండాయి మజ్జానం బువ్వ దెచ్చి ఏపసెట్టుకింద పెట్టేతలికి.

"బట్టలు గుంజుకోవాలంట" అన్నాడు కొండాయి.

"బట్టలు యిప్పుడే గుంజుకోవాలెట్టా? నువ్వు బువదిన్నా వంట్రా?" అన్నాడు పాపయ్య బువ కాడకూకుంటా.

"తిన్నానయ్యా, అదేమో నేను బెవ్వా లాడుకుం టుంటే వొచ్చి బువతీసికెల్లని అమ్మకొట్టిందే!"

"అయితే ఎప్పుడూ బెవ్వాలేనంట్రా నువాడేదీ?"

"బిల్లంగోడుకర్ర సుబ్బాయి తీసికెల్లాడు."

"ఛీ యదవా ఎప్పుడూ ఆటలేనంటుంటే!"

"నిన్నా, యియ్యాలేనయ్యా నేఆడ్తుండనీ! అయ్యోవ్? బళ్ళోకె పంపిత్తానంటివే?"

"ఎల్దువులే బడియాడికిపోద్ది యిదిగో యీపాలి గట్టిగా పంతుల్తోసెప్పి బళ్లో సేరిపిత్తే సరిగా! మరి ఎప్పుడు సెప్పినా పైనొచ్చే మంచిరోజున సేరిపిత్తా నంటాడేగాని మరామంచి రోజు ఎప్పుడొచ్చుద్దో యిన్నాలకి తేలకబోయె! సివరికి సేతిలో యీవన్నా పెట్టమంటాడో ఏందో మరి? యిదిగో యీపాలి అదేదో గట్టిగా నిలేసి తేల్చుకుంటాగా, ఒరే కొండాయ్?"

"ఏందయ్యా?"

"అయితే మీ అమ్మ యింటికాడ ఏంజేసుద్దంటా?"

"బట్టలు గుంజుకోవాలంట."

"ఇప్పుడే బట్టలు గుంజాలెట్టా? బువదీసుకుని కూసేపు యిటొచ్చిపోతే కాళ్లేం అరిగిపోతయ్యా? ఒరే కొండాయ్?"

"ఏందయ్యా?"

"రేపు మజ్జానం మీ అమ్మనే బువపట్టుకురామను."

"రేత్తిరి అమ్మతో నువే సెప్పరాదంటయ్యా?"

"పరవాలేదులే సెప్పమంటూంటే?"

"నాకేం, అయ్య సెప్పమన్నాడని సెబుతా."

"చా ఎదవా పోళ్ళురాత్తిరయి సెప్పావంటే తెల్సిందా! ఎవురో వొచ్చి అప్పుడే బల్లగట్టుమీద కూకుండారే! కాత్తే వుండవయ్యా బువదింటుండానూ – అంటా బువతీసుకురాటానికి బూసమ్మ పాలుమాల్తుండదని చిరాకుబడ్తా బువకాణ్ణించి లెగిశాడు పాపయ్య.

  

ఓనాజు బాగా రేత్తిరయినాక బల్లకట్టుపాపయ్య యింటికెల్దామని గెట్టుదిగే సమయానికి అవతలిగెట్టునుంచి పోరుగూరు ఎల్లివస్తావుండ సుబ్బయ్య గొంతు యినిపించింది.

"రా, రా, సుబ్బయ్యన్నా – యింగా నయం యిప్పుడే బల్లకట్టేసి గెట్టు దిగబోతుండా – ఎన్నాలయిందీ సూసీ! ఏవూ రెల్లావూ ఏందికతా రా, రా–".

సుబ్బయ్యను యివతలి గట్టుకు సేర్చి మళ్లీ బల్లకట్టు గొలుసు బిగిచ్చాడు పాపయ్య.

"కూసేపు కూకునెల్దాం కూసో పాపయ్యా. అబ్బ నడిసి నడిసి సివరకి మనూరి సాయలకొచ్చేతలికి పోయిన పానం మళ్లీ తిరిగొచ్చిందంటే నమ్ము! కాళ్లు గుంజుతుండై కూసేపు కూకుని పోదాంలే వుందూ-ఆఁ తంగిరాల్లో బాకీవుంటే పోయినాలే - కూకో, కూకో నీ పెళ్ళాంతో నేను సెబుతాలే" అన్నాడు సుబ్బయ్య గట్టుమీన సాగిలపడ్తా.

"ఆఁ, అదసలే గుబులు మడిసి" అన్నాడు పాపయ్య పొద్దు సానాపోయిందనుకుంటా.

"కాదుమరి! ఎంతసెడ్డా పెళ్లామాయె. యిదిగో మనగాడి లంకపుగాకుండది ఓ పాయసుట్టిసూడు - కూకో - నాంకాడ సెకుముకి వుండదిలే."

సుబ్బయ్య, బల్లకట్టు పాపయ్యలు సుట్టలు ముట్టిచ్చి కూకుండారు సీకట్లో కోటయ్య కొండమీద శికరాలకిమల్లే.

ఆ వజాన కూకని సుబ్బయ్య బల్లకట్టు పాపయ్యలు ఏమ్మాట్లాడకుండా సుబ్బయ్య పాపయ్యతో సెప్పిన అస్సల్సంగతిది:—

"పుగాకు అమ్మకం బెట్టిన మన రత్తయ్యను ఎరుగుదువుగా!" అన్నాడు సుబ్బయ్య.

"అదేంది సుబ్బయన్నా రత్తయ్యనే ఎరగనంటా!" అన్నాడు పాపయ్య.

"నీకు ఎందుకు తెలవదుగానీ, అయితే యీ సంగతి యిన్నావా?" అన్నాడు సుబ్బయ్య.

"అదేందో నాకేం తెలుసుగ్గి సెప్పందీ ?" అన్నాడు పాపయ్య.

"రత్తెయ్య పెళ్లాం కాంతమ్మ ఆ పొరిగింట ఈరబెమ్మం పిలుస్తే దేశాంతరా లెళ్లిందంట !" అన్నాడు సుబ్బయ్య.

"చా !" అంటూ నోరు దెరిశాడు బల్లకట్టు పాపయ్య.

"చా ఏంది ! రెండు మూడు దినాలు కప్పిపెట్టారు. చివరకి గబ్బులెగిసింది " అన్నాడు సుబ్బయ్య సట్టపొగ పంతి సందుల్నించి వొదుల్తా.

"అదేంది – కాంతమ్మ – !" అంటున్నాడు పాపయ్య యింకా తెప్పరిల్లక.

"మంచిదేమరి ! ఏమయినా యివన్నీ మనమాటల్తో కట్టుబడుండే యవారాలు కాదు సూడూ ! యీ రత్తెయ్యేమో నాలుగు డబ్బులు సంపాయిచ్చుకోద్దామని రెండు మూడు దినాలపాటు పొరుగూరు ఎల్తా వుంటాడూ, మరి యీమద్దెన ఈరబెమ్మం ఏం పసుపుపూశాడో ఏమో – కాంతమ్మకాస్తా మాయమయింది!" అన్నాడు సుబ్బయ్య.

"అంతా మాయగావుంది !" అన్నాడు పాపయ్య.

"ఇదిగో మన్లోమాట – మనూరి రంగయ్యకు నువేమన్నా బాకీ పడ్డావంటయ్యా పాపయ్యా?" అనడిగాడు సుబ్బయ్య.

"ఆఁ వుంటే రూపాయో, రెండో వుంటదిలే" అన్నాడు పాపయ్య.

"అబ్బే ఏంలేదుగానీ, వాడి గుణం మనూళ్లో అందరికీ తెల్సిందే గదా ? ఆఁ. నువు యింటో లేనప్పుడు ఎల్లి నీపెళ్లాం

బూసమ్మను ఏదించుకుతిటాడంట. ఆడ్డి ఆడికి పారేయరాదూ పీడా వొదుల్తుందీ – మాట్టాడుకుంటా ఎల్దాం లెగు పొద్దుపో తుండదీ" అంటా పంచ దులుపుకుంటా లెగిశాడు సుబ్బయ్య.

"ఓ బల్లకట్టు పాపయ్యనోవ్ ! బాబ్బాబు కొంత్తె బల్ల కట్టు యివకాడికి రానియినాయునా సానాపొద్దు పొయ్యో చ్చామూ" అనరిశాకు ఎవురో ఆతలి గట్టునుంచి.

  

ఆ రేత్తిరీ, మరసనాడు ఏకువజామునా బల్లకట్టు పాపయ్య బజనపాటలు ఎవురికీ యినాలా.

మజ్జానం బువదెచ్చిన కొండాయికి బల్లకట్టు వొప్పజెప్పి, మొట్టపల్లికి గబగబ ఎల్లి తనింటోనించి రంగయ్య సుట్టముట్టిం చుకుపోతుంటం సూసిన బల్లకట్టు పాపయ్య ఎల్లి పెళ్ళాం బూసమ్మ వొళ్ళు పచ్చడిజేసి బల్లకట్టుకాడికొచ్చి యిగ ఆడనే గెడకర్ర తీసుకు కూకుండాడు.

ఆ సిశిరేత్తిరి కిట్టకాలవగెట్టుకాడికొచ్చి, పాపయ్య కెదు రూగ్గా నిలబడ్డది పెల్లాం బూసమ్మ కొడుకు కొండాయితో.

"ఇంటికి ఎల్దాం రా" అంది బూసమ్మ ఏడుస్తా.

" దెగ్గిరకొచ్చావంటే సంపుతా – ఎల్లు " అన్నాడు పాపయ్య.

"సంపు, సంపి యీ కిట్టకాలవలో పారెయ్యి నన్ను. నే నేపాపం ఎరగను, నీ కేందో గుబులు తిరిగింది" అంది బూసమ్మ.

"ఎవ్వురికి తిరిగిందో యియాల తేలుత్తా" అన్నాడు పాపయ్య.

"నువ్వు ఏందేల్చినాసరే నేను యీడే పాణం వొదుల్తా" అంది బూసమ్మ.

ఆ వజాన ఏంజరిగినా జరగనీ – రేత్తిరి మూడుగంటల యాలకు బల్లకట్టు పాపయ్యను ఎంటబెట్టుకుని కొండాయితో యింటికిసేరింది బూసమ్మ.

అప్పట్నుంచి కొన్నేళ్ళు అయ్యా, అమ్మకు బెదుస్తా రావటం కొండయ్య సూస్తావొచ్చాడు.

"ఒరే కొండయ్యా!" అని ఓనాడు కొడుకును పిలిశాడు మంచంలో కూకుండ బల్లకట్టుపాపయ్య.

"ఏందయ్యా?" అన్నాడు కొండయ్య.

"రేపట్నుంచి యిగమీదట బల్లకట్టుపని నువ్వుసూసుకో. నాపని అయిపోతుండది" అన్నాడు బల్లకట్టుపాపయ్య.

"నా పెళ్లాం బల్లకట్టుపని వొద్దంటున్నది" అని సెప్పాడు కొండయ్య.

మరసనాడు కోడికో పాలు తెగిసే, పెళ్లాం కట్టబెట్టిన సద్ది మూట తీసుకుని కిర్రుపాదుసుకుంటా బజనపాటలు పాడుకుంటా ఎప్పటికిమల్లే కిట్టకాలవ బల్లకట్టువేపుగా ఎల్లాడు బల్లకట్టు పాపయ్య.

★

